# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | |
|---|---|---|---|
| భారత చరిత్ర - 18 | ... 2 | నిజంలాటి కల | ... 44 |
| దాస్య విముక్తి | ... 5 | యుక్తివేరు - శక్తివేరు | ... 47 |
| రాకాసిలోయ - 21 | ... 9 | రామాయణం | ... 49 |
| విషమ పరీక్ష | ... 17 | ప్రపంచపు వింతలు | ... 57 |
| చ్యవనుడి కథ | ... 25 | సహవాసదోషం | ... 62 |
| గంధర్వ చక్రవర్తి కూతురు | 33 | భారతం | ... 64 |


ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



ఫోటో: బుద్ధా పిక్చర్స్‌వారి సౌజన్యం—ఎ.వి.ఎమ్.










JHANKAR

# రొంపను దరిచేరనీయకండి

సేవించండి

## వాటర్‌బరీస్ కాంపౌండు | ఎర్ర లేబిలు

## కేవలం నివారిణియే కాదు నమ్మకమైన టానిక్కు కూడా!




వాటర్ బరీస్ కాంపౌండు మీద, తరతరాలుగా, కుటుంబాలు నమ్మకముంచి ఆధారపడడానికిగల అనేక మంచి కారణాలలో నాలుగింటిని ఈ క్రింద ఉదహరిస్తున్నాము.

1. వాటర్ బరీస్ కాంపౌండులో క్రియోసోట్ మరియు గయాకోల్ గలవు. అవి వాయు తిత్తులను శుభ్రపరుస్తాయి.
2. వాటర్ బరీస్ కాంపౌండు దగ్గులను సత్వరం ఫలప్రదంగా నిర్మూలిస్తుంది.
3. వాటర్ బరీస్ కాంపౌండు నివారిణియేగాక నమ్మకమైన టానిక్కు కూడా. శరీరప్రతిఘటన శక్తిని పెంపొందించడంలో సాయపడుతుంది.
4. వాటర్ బరీస్ కాంపౌండు ఆకలిపుట్టిస్తుంది. జీర్ణమగుటలో సాయపడుతుంది. రక్తమును శుభ్రపరుస్తుంది. మరియు ఖనిజ లవణముల నష్టమును భర్తీ చేస్తుంది.



## వాటర్‌బరీస్ కాంపౌండు | ఎర్ర లేబిలు

వార్నర్-లేంబర్ట్ ఫార్మసూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతలలో యు ఎస్. ఎ లో స్థాపితము)

WCRY-3-TEL

# పాఠకుల లేఖలు

## మార్చి 1963

"రాకాసిలోయ", "తప్పిన వాగ్దానం", "గంధర్వ చక్రవర్తి కూతురు", "సీమంతిని" కథలు చాల బాగున్నవి. ఆ రచయితలకు నా కృతజ్ఞతలు అందజేయగోర్తాను.

—ఈ. సీతారామయ్య, నారపాడు

ఈ మాసపు కథలలో "గంధర్వ చక్రవర్తి కూతురు", "సీమంతిని", ముఖ్యంగా వర్ణ చిత్రాలు, ముఖచిత్రం, "రాకాసిలోయ" అత్యంత రమణీయంగ, బంగారుకు సువాసన అబ్బినదా యున్నట్లున్నవి.

—ఎమ్. బి. షుకూర్, విశాఖపట్నం

"సీమంతిని", "మోనగాడు", "అమ్మ చెప్పిన మాటలు" మొదలగు కథలు చాలా బాగున్నాయి. "రాకాసిలోయ" చదువుతుంటే, పై మాసపు "చందమామ" కూడా ఇప్పుడే వస్తే ఎంత బాగుణ్ణు అనిపిస్తుంది.

—జి. చంద్రశేఖర్రావు, విశాఖపట్నం

ఫిబ్రవరి "చందమామ" చాలా బ్రహ్మాండముగా నున్నది.

—చొప్పెర్ల వెంకటసత్యనారాయణ, తేతలి

అట్ట చివరి బొమ్మ ఆకర్షణీయంగా వుంది. "రాకాసిలోయ" సీరియల్ మంచి పట్టుతో నడుస్తున్నది. "దాస్య విముక్తి" చాలా బాగున్నది. "తప్పిన వాగ్దానం", "సీమంతిని" ఆకర్షణీయంగా ఉన్నాయి.

-ఎ. వి. ఆర్. సుబ్రహ్మణ్యం, హైదరాబాదు

కథలు బాగున్నాయని ఊరికే పొగడి వ్రాయడం నా కిష్టం లేనందున మీరు దీనిని ప్రచురించలేరని తెలిసి వ్రాస్తున్నాను. మంచి కథలు: "గంధర్వ చక్రవర్తి కూతురు", మోసగాడు", "దాస్య విముక్తి", రామాయణం. ("రాకాసిలోయ" వినుగెత్తి పోయాయి. దాన్ని గురించి మంచీ చెడ్డా రాయలేను.) బాగులేని కథలు: "అమ్మ చెప్పిన మాటలు", "సీమంతిని", "నాగ కిరీటం". "నాగ కిరీటం" బొత్తిగా బాగులేదు. పూర్వాపర విరుద్ధముగా నున్నది.

—ఎస్. జాంసాబు, నిజామాబాదు

ప్రతి నెలా నేను "చందమామ" రాగానే మొట్ట మొదట "రాకాసిలోయ" చదువుతుంటాను. "గంధర్వ చక్రవర్తి కూతురు" మా పాఠకులకు అందజేసినందులకు నా ధన్యవాదాలు.

—ఎస్. కే. అమీర్ బాషా, గూడూరు

ఈ నెల మా అభిమాన "చందమామ" మా హృదయాలు దోచుకొన్నది. "గంధర్వ చక్రవర్తి కూతురు", సీమంతిని", "నాగ కిరీటం" కథలు ఎంతో బాగున్నవి.

—ఎన్. నరసింహారావు, తిరుమల

"దాస్య విముక్తి" గేయకథ చాలా బాగుంది. "తప్పిన వాగ్దానం", "అమ్మ చెప్పిన మాటలు", "మోసగాడు", ఈ కథలు మా ఇంటివారి నందరినీ ఆకర్షించాయి. "రాకాసిలోయ" మకుటానికి మాణిక్యం లాంటిది.

—గానిగ రాజారాంబాబు, గుంతకల్లు

ప్రపంచ వింతలు, రామాయణం, భారతం అమోఘమైనవి. "దాస్య విముక్తి" వంటి గేయము రచించిన ఉత్పల సత్యనారాయణాచార్యగారు అభినందనీయులు.

—కర్రి జగన్నాథరెడ్డి, అనపర్తి


కర్తవ్య
నిర్వహణలో మొదటి
వరుసలో...


మన సైనికులలో శక్తి ఉత్సాహములకు కొదువ
లేదు మరియు రుచికరమైన, శ్రేష్ఠ మయిన
మరియు శక్తిదాయకమైన జె.బి. మంఘారామ్స్
బిస్కట్లు మరియు మిఠాయిలు వారికి ఉత్సాహము
మరియు అధిక శక్తిని యిస్తాయి. వారి కఠినమైన
జీవనములో యివి వరప్రసాదము !
జె. బి. మంఘారాం అండ్ కం.
గ్వాలియర్ అండ్ హైదరాబాదు
వివిధ రకముల బిస్కట్లు మరియు కన్ఫెక్షనరీ తయారులో
అత్యంత ఘనమైన జాతీయ సంస్థ.
J.B. MANGHARAM'S
Salto
Royal Cream
BISCUITS
JB-106A TEL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో వివేకానందుడి బాల్యం అన్న వ్యాసం ఉన్నది. భారతదేశం ఆధ్యాత్మిక చింతనకు ప్రసిద్ధి కెక్కినది. వేదకాలపు ఋషులేగాక బుద్ధుడు, మహా వీరుడు మొదలుకొని రామకృష్ణ పరమహంస, వివేకా నందుల దాకా ఎందరో మహాపురుషులు ఆధ్యాత్మిక తత్వాన్ని లోకానికి చాటారు. అలాటి మహాపురుషుడైన వివేకానందుడి శతజయంతి ఈ యేడు మన దేశ మంతటా జరిగింది.

"చందమామ" వెల 60 న. పై. లకు పెంచటం ముందు చెప్పినట్టు ఈ మాసం నుంచి కాక పై మాసం నుంచి అమలులోకి వస్తుంది. ఇందుకు తమ ఆమో దాన్ని తెలుపుతూ అనేకమంది పాఠకులు రాశారు. వారి ఆదరాభిమానాలకు కృతజ్ఞులం.

సంపుటి : 32 - మార్చి 1963 - సంచిక : 3





# భారత చరిత్ర




ఘురార్ మహమ్మద్‌కు వారసులు లేరు. అతని ప్రతినిధులు (వైస్రాయిలు) తమ తమ ప్రాంతాల మీద స్వతంత్రాధికారం ప్రకటించారు. తాజుద్దీన్ యిల్దిజ్ అనేవాడు ఘజ్నీలో ప్రభువయాడు. భారత ప్రాంతం లోని వైస్రాయిలు కుతుబుద్దీన్ ఐబక్‌ను సుల్తాను చేసి ప్రభువుగా గుర్తించారు. ఇలా గుర్తించిన వారిలో బెంగాలు వైస్రాయి ఇఖ్తియారుద్దీన్, ముల్తాన్ వైస్రాయి నాసిరుద్దీన్ కబాచా ఉన్నారు. ఇందువల్ల తాజుద్దీన్‌కు కుతుబుద్దీన్‌పై అసూయ కలిగి, పంజాబుపై అధిపత్యం కోసం కుతుబుద్దీన్‌తో యుద్ధానికి తలపడ్డాడు. కుతుబుద్దీన్ అతన్ని ఓడించి, ఘజ్నీ నుంచి తరిమివేసి, నలభై రోజులపాటు ఆ నగరాన్ని అక్రమించాడు. అయితే అతను చేసిన అత్యాచారాలు సహించలేక ఘజ్నీ పౌరులు రహస్యంగా తాజుద్దీన్‌ను రప్పించారు. తలవని తలంపుగా తాజుద్దీన్ తిరిగి రావటంతో కుతుబుద్దీన్ పారిపోయి రావలిసి వచ్చింది. ఈ విధంగా జరగని పక్షంలో అతని హయాములోనే ఇండియా అఫ్ఘానిస్తానులు రాజకీయంగా ఏకమై ఉండేవి.

1210 నవంబరులో, కుతుబుద్దీన్ పోలో ఆడుతూ గుర్రంపై నుంచి పడిన ఫలితంగా లాహొరులో మరణించాడు. అతను పరిపాలించింది గట్టిగా నాలుగేళ్ళు మాత్రమే. అతని దాతృత్వం జగద్విఖ్యాతమైనది; "లక్షదాత" అని అతనికి బిరుదుండేది. అతని పరిపాలనలో న్యాయమూ, శాంతి భద్రతలు చక్కగా ఉండేవి.

కుతుబుద్దీన్ చావగానే దేశం అరాజకం అయిపోకుండా, లాహొరులోని అమీర్లూ, మాలిక్‌లూ, ఆరామ్ బక్ష్ అనేవాణ్ణి సుల్తానుగా ఎన్నుకుని, ఆరామ్ షా అని పేరు పెట్టారు. అయితే ఈ ఆరామ్ షా బొత్తిగా

**18.** బానిసవంశం – ఇల్తుత్మిష్

అసమర్థుడు కావటంచేత ఢిల్లీలోని "పెద్దలు" అతణ్ణి తొలగించి, మాలిక్ షంసుద్దీన్ ఇల్తుత్మిష్‌ను రాజుగా చేశారు.

ఇల్తుత్మిష్ తుర్కిస్తాన్‌లోని ఇల్బరీ తెగకు చెందినవాడు. గొప్ప అందగాడు, తెలివితేటలూ, ఉపజ్ఞా కలవాడు. అందుకే కుతుబుద్దీన్ ఢిల్లీలో వైస్రాయిగా ఉండే సమయంలో ఇల్తుత్మిష్‌ను పెద్ద ధర యిచ్చి బానిసగా కొన్నాడు. ఇతను క్రమంగా తన హోదా పెంచుకుని బదాఊన్‌కు గవర్నరు కావటమేగాక కుతుబుద్దీన్ కుమార్తెను కూడా పెళ్ళాడాడు.



1210 లేక 1211లో ఇల్తుత్మిష్ ఢిల్లీ సింహాసనం ఎక్కుతూనే గడ్డు సమస్యలను ఎదుర్కొన్నాడు. నాసిరుద్దీన్ కబాచా సింధులో స్వాతంత్ర్యం ప్రకటించటమేగాక పంజాబు పైన కూడా కన్ను వేశాడు. ఘజ్నీలో ఉన్న తాజుద్దీన్, ఘూర్ మహమ్మద్ గెలిచిన ప్రాంతమంతా తనది చేసుకోవాలనే ఆశతో ఉన్నాడు. ఇఖ్తియారుద్దీన్ అనంతరం 1206లో బెంగాలు గవర్నరుగా నియమించ బడిన అలీమర్దాన్ అనే ఖిల్జీ వంశస్థుడు సుల్తాన్ అలాఉద్దీన్ అని పేరు పెట్టుకుని స్వాతంత్ర్యం ప్రకటించాడు. గ్వాలియర్, రంతంభోర్‌లు ఆరామ్ షా హయాములో తిరిగి హిందూ రాజుల అధీనమయాయి; మిగతా హిందూ రాజులు రాజ్యకాంక్షతో తహతహ లాడుతున్నారు. ఇవన్నీ ఇలా ఉండగా ఢిల్లీలోనే కొందరు అమీర్లకు ఇల్తుత్మిష్ పరిపాలన సరిపడలేదు.

ఇల్తుత్మిష్ ఈ అవాంతరాలన్నిటినీ క్రమంగా అధిగమించుకుంటూ వచ్చాడు. ఢిల్లీ సమీపంలోని జూద్ మైదానంలో తిరుగుబాటు చేసిన అమీర్లను ఓడించాడు. 1216 జనవరిలో తాజుద్దీన్‌నూ, 1217 లో నాసిరుద్దీన్‌నూ ఓడించాడు. అయితే నాసిరుద్దీన్ 1228 ఫిబ్రవరి దాకా పూర్తిగా పతనం కాలేదు. 1229 లో బాగ్దాదులో ఖలీఫాగా

ఉండిన అల్ ముస్తన్సిర్ బిల్లా, ఇల్తుత్మిష్‌ను గుర్తించుతూ, వస్త్రకానుక పంపి, అతనికి "సుల్తాని ఆజమ్" (సుల్తాను శ్రేష్ఠుడు) అనే బిరుదు కూడా ఇచ్చాడు.

1226 లో రంతంభోర్ తిరిగి ఇల్తుత్మిష్ అధీనమయింది. 1230-31 లో బెంగాలు లోని ఖల్జీలు లోబడిపోయారు. 1232 లో గ్వాలియర్‌ను పరిపాలిస్తున్న మంగళ దేవుడు ఓడిపోయాడు. 1234 లో మాల్వా, ఉజ్జయినీలు ఓడిపోయాయి. ఉజ్జయిని నుంచి ప్రసిద్ధమైన విక్రమాదిత్యుడి శిలాప్రతిమ ఢిల్లీకి చేర్చబడింది. ఇల్తుత్మిష్ 26 సంవత్సరాలు పరిపాలించి 1236 ఏప్రిలు 29 న ఢిల్లీలో చనిపోయాడు.

ఇల్తుత్మిష్ హయాంలో నే మొట్ట మొదటిసారిగా మంగోలులు సింధూ నదీతీరం దాకా వచ్చారు. వారి నాయకుడు చరిత్ర ప్రసిద్ధుడైన ఛంగీజ్ ఖాన్. ఇతని అసలు పేరు తెముచీన్. ఇతను 1155 లో పుట్టి, చిన్నతనంలో చాలా కష్టాలు పడి, కాలక్రమాన మహానాయకుడై, మధ్య ఆసియాలోని అనాగరిక జాతులతో సామ్రాజ్యం ఏర్పాటు చేశాడు. అయితే మంగోలులు ఢిల్లీ సుల్తానులను బాధించకుండా అప్పటికి తిరిగి వెళ్ళిపోయారు.

ఢిల్లీని తుర్కీ సుల్తానులు 1290 దాకా పరిపాలించారు. వారిలో ఇల్తుత్మిష్ చాలా గొప్పవాడు. ఇతను తన పరిపాలనా కాలమంతా యుద్ధాలలో గడిపి కూడా కళలను గొప్పగా పోషించాడు. ఇతని కీర్తికి శాశ్వత చిహ్నంగా నిలిచి ఉన్న కుతుబ్ మినారు నిర్మాణం 1231-32 లో పూర్తి అయింది. ఈ స్తంభానికి కుతుబుద్దీన్ ఐబక్ పేరు పెట్టారన్నది అపోహ. బాగ్దాదు ప్రాంతం నుంచి వచ్చిన ఖ్వాజా కుతుబుద్దీన్ అనే ప్రముఖుడు ఢిల్లీలో నివాసం ఏర్పరచుకున్నాడు. ఈయన గౌరవార్థం ఇల్తుత్మిష్ కుతుబ్ మినారు నిర్మించి, సుల్తాన్ కుతుబుద్దీన్, సుల్తాన్ ముయిజుద్దీన్‌ల పేర్లు దానిపై రాయించాడు.







# దాస్య విముక్తి

తృతీయాశ్వాసము :

నాటిరాత్రి కద్రువ తన
నందనులను దరికి పిల్చి
కన్నీరులు జాలువాఱ
కంఠము డగ్గుత్తిక పడ—

"నాయనలారా! ఇప్పుడు
నా కొక ఇక్కట్టు వచ్చె;
శేషుడిపుడు ఇంట నున్న
చింతించెడి దాన గాను."

అని చెంపల జాఱు నీరు
అఱ చేతులతో తుడుచుచు,
పలికిన తమ తల్లితోడ
పాములు ఇట్లని పల్కెను;

"అమ్మా! నీకు ఘటిల్లిన
ఆపద వచియింపుమమ్మ;
శేషు డిపుడు లేనందుకు
చింతించుట మానుమమ్మ.

నీ దుఃఖము పోగొట్టగ
నిశ్చయించుకొని యుంటిమి;
తొమ్మిది వందల తొంబది
తొమ్మండ్రము మే ముంటిమి."

అని పలుకగ కద్రూ సతి
తనయులతో ఇట్టు లనెను.
"సంజ వేళ వినత తోడ
సంద్రపు టొడ్డుకు వెళ్ళితి—

అచ్చట నొక హయ మున్నది,
అచ్చ తెలుపుగా నున్నది;
దాని తెలుపు వినతా సతి
దైని కైన లే దన్నది.

నేను వినోదమున కపుడు
దాని తోక నలు పంటిని,
కాదు కా దటంచు వినత
వాదులాడి పందెమేసె.

ఉత్పల సత్యనారాయణాచార్య

ఓడిన వా రింకొకరికి
ఊడిగ మొనరించునట్లు
వినత పలుక నేను కూడ
వెనుదీయక ఒప్పుకొంటి.

వినత తాను గెల్చెద నని
విఱ్ఱ వీగు చున్న దిపుడు;
దాని గర్వ మడచి నాకు
దాసీ దానిగ చేయుడు.

అని పలికిన విని వాసుకి,
"అమ్మా! ఇది తప్పు కదా!
అది ఇంద్రుని ఉచ్చైశ్శ్రవ
మచ్చ తెలుపు హయము కదా!"

అనిన దిగ్గన లేచి కద్రువ
ఆగ్రహమ్మున ఇట్లు పలికెను
"కామ రూపులు మీకు సాధ్యము
కాని పని ఏదైన కలదా!

రేపు మీలో నొకడు నల్లని
రూపు దాలిచి పోయి, వెఱువక
గట్టిగా ఆ హయము తోకను
పట్టుకొని వ్రేలాడు చుండుడు.

వినత కది చూపించి గెల్తును,"
అనిన వాసుకి తక్షకాదులు,
"అది అధర్మము జయము కా"దని
అంద ఱొకటై బదులు పల్కిరి.

అంద ఱట్టులు పలుక కద్రువ
అమిత కోపోద్రిక్త యయ్యెను;
కండ్లు ఎఱ్ఱగ జేసి పటపట
పళ్ళు కొఱుకుచు ఇట్లు పలికెను:

"తల్లి మాటలు వినక మీరలు
తప్పు లని జవదాటి నారలు—
అల్ల జనమేజయుని యాగము
నందు దగ్ధము కాగలారలు!



ఇదియె శాపం''బనుచు కద్రువ
ఎగసి పడి గద్దించి పలికెను;
ఆమె మాటల కెల్ల వారలు
అట్టు లుడికిన యట్టు లుడికిరి.

వారిలో కర్కోటకుం డను
వాడు, ఐదవ వాడు, క్రూరుడు;
తల్లి మెప్పును బడయు నాతడు
తరుణ మిది యని తలచి ఇట్లనె;

"అమ్మా! ఈ కర్కోటకు
డా పని ఒనరింపగలడు,
వినతను నీ దాసి చేసి
వెట్టికి పెట్టింపగలడు."

అనిన కద్రువ సంతసించెను,
అతనిని ఆశీర్వదించెను,
హాయిగా నా రెయి ఎదపై
చేయి పెట్టుక నిద్రపోయెను.

తెల్లవాఱు మునుపె లేచి,
తల్లి పాదములకు మ్రొక్కి,
కర్కోటకు డబ్ధి కడకు
కాము రూపియై ఏగెను.

అప్పటికే ఉచ్చైశ్రవ
మటకు వచ్చి మేయుచుండె;
పచ్చికలో నల్లని పెను
పామై కర్కోటకుండు—



వెను వెన్కనె మెలమెల్లగ
వెళ్ళి దాని తోక పట్టి,
తల్లక్రిందుగా నాతడు
నల్లగ వ్రేలాడు చుండె.

అటు పిమ్మట కద్రూ సతి
అచ్చోటికి వడి వడిగా
వేడుకతో వినతను తన
వెంట బెట్టుకొని వచ్చెను.

" అదిగొ! గుఱ్ఱము చూడు మిప్పుడు,
అచ్చ తెల్లని దంటి వప్పుడు;
దాని నల్లని కుచ్చు తోక ని
దానముగ పరికించు మిప్పుడు."

అనిన గుండె గతుక్కుమన, అ
ల్లంత దూరమునందె నిలబడి,
వెఱ్ఱి బాగుల వినత చూచుచు
వింత పడి వెలవెలన వోయెను.

అపుడు కద్రువ " ఏమి పలుకవు?
హయము వాలము తెలుపా? నలుపో?
ఇప్పుడే ఓ నంగ నాచీ!
చెప్పు "మని గద్దించి పలికెను.

వినత గజగజ వణక సాగెను,
కనుల గిఱ్ఱున నీరు తిరిగెను,
కనిక రింపు మటంచు కద్రువ
కాళ్ళపై బడి ఏడ్వ సాగెను.

" ఓసి దాసీ! లేచి ర మ్మిక
ఊడిగపు పని చేసి ఏడ్వుము "
అనుచు కద్రువ ఆనతీయగ,
వినత అక్కా! అనుచు ఏడ్చెను.

" దాసి దానికి అక్కనా? నో
ర్మూసికొని నా వెంట ర మ్మిక "
అనుచు కద్రువ మండి పడగా
వినత మెల్లగ లేచి వెళ్ళెను. —(సశేషం)






## 21

[సారంగ మార్గాన్నుంచి పారిపోయిన చండమండూకుడూ, బ్రహ్మదండి మాంత్రికుడూ కలిసి, అడవి మధ్య వున్న పాడుపడిన బావి దగ్గిర కేశవుడూ, జయమల్లుల కోసం కాపలా వేశారు. కాని, తీరా వాళ్ళు బావి నుంచి పైకి వచ్చే సమయంలో, దాపుల వున్న చెట్ల మీది నుంచి వచ్చిన కేక విని మండూకుడూ, బ్రహ్మదండీ పారిపోసాగారు. తరవాత—]

కేశవుడూ, జయమల్లూ, కోయ యువకుడూ బావి నుంచి పైకి వస్తూనే పారిపోతున్న, చండమండూకుణ్ణీ, బ్రహ్మదండి మాంత్రికుణ్ణీ చూసి ఆశ్చర్యపడ్డారు. వాళ్ళతోపాటు కొందరు నరభక్షకులు కూడా పిక్కబలం కొందికీ అడవిలోకి పరిగెత్తుతున్నారు. అంతలో దాపుల వున్న చెట్ల మీది నుంచి కేశవుడి తండ్రి అయిన ముసలివాడూ, గడేజంగ్ అనుచరుడైన కోయయువకుడూ కిందికి దూకారు. తండ్రిని చూడగానే కేశవుడికి కలిగిన ఆనందం అంతా యింతా కాదు. అతడు చేతులు పైకెత్తి ఉత్సాహంగా ఒక్క కేక పెట్టి, 'అయ్యా' అంటూ ముందుకు పరిగెత్తబోయేంతలో, వెనక పాడుబడ్డ బావిలోంచి రణగొణ ధ్వని వినిపించింది. అప్పటిగ్గాని, కేశవుడికీ, జయమల్లుకూ, తమను సారంగమార్గాన తరుముకు వస్తున్న నరభక్షకుల సంగతి గుర్తుకు రాలేదు.



వెంటనే వాళ్ళిద్దరూ, కోయయువకుడూ వెనక్కు తిరిగి బావి కేసి రెండడుగులు వేసేంతలో, ముసలివాడు పెద్దగా నవ్వి, "ఆ దుర్మార్గు లిద్దర్నీ హడలకొట్టాను. ఇప్ప చెట్లమీద వున్న ఇరవైమందీ, నేరేడు చెట్లచాటున వున్న నలభైయిద్దరూ...అని కేక పెట్టగానే, అ నీచులు తారుకు పోయారు. ఇక ప్రస్తుతానికి ప్రమాదం లేదు," అంటూ ముందుకు రాబోయాడు.

తన తండ్రికి తమను వెన్నాడి వస్తున్న నరభక్షకుల సంగతి తెలియదని గ్రహించిన కేశవుడు చప్పున వెనుదిరిగి, "అయ్యా, ఇంకా మనకు ప్రమాదం తొలగలేదు. ఒక



మందకు మంద నరభక్షకులు సారంగ మార్గాన్నుంచి యిటు వస్తున్నారు..." అని హెచ్చరించే లోపలే, పదీ పన్నెండుమంది నరభక్షకులు కీచుమని అరుస్తూ, ఈటెలు పైకెత్తి బావిలోంచి బయిటికి దూకారు. అదే సమయంలో ముసలివాడూ, కోయ యువకుడూ నిలుచున్నచోటుకు వెనకగా వున్న పొదల్లో నుంచి, "మనం అనవసరంగా భయపడ్డాం. ముసలి వెధవ పెద్ద మోసం చేశాడు. అంతా కలిసి వాళ్ళు అయిదుగురే! చంపండి," అన్న చండ మండూకుడి కేక వినబడింది.

"కాలభైరవా, ఉపాసకుల ఊడల మర్రీ...అ కేశవుణ్ణి చంపకండి! వాణ్ణి ప్రాణాలతో పట్టుకోండి. వాడు చస్తే యిక మనం బతికివుండీ లాభంలేదు. రాకాసి లోయ......బంగారం......వెండి....అర్ధ రాజ్యం..." అంటూ బ్రహ్మదండి నెత్తీ నోరూ కొట్టుకుంటూ అరవసాగాడు.

రెప్పపాటు కాలంలో తను ఆశించిన దానికి భిన్నంగా జరిగిపోవటం చూసి ముసలివాడు ఓ తృటికాలం నిర్విణ్ణుడయాడు. ఎన్నో రోజుల తరవాత తను తన కొడుకును చూడటం జరిగింది. కాని, ఆ ఆనందానికి తను నోచుకోలేదు. ఇప్పుడు





తనూ, తన కొడుకూ కూడా నరభక్షకులతో అన్నిటికీ తెగించి పోరాడాలి.

"చిన్న గడేజంగ్! నువ్వేమీ భయపడకు. మన చేతుల్లో కత్తులున్నంతవరకూ మన నెవరూ ఏమీ చేయలేరు. ఊఁ మహా చండీ!" అంటూ ముసలివాడు నరభక్షకులతో పోరుకు తలపడ్డాడు.

ముసలివాడు పెట్టిన ముద్దు పేరుకు తగినట్టే చిన్న గడేజంగ్ అసహాయ శూరుడు. తమ నాయకుడిలాగే అతడికి ప్రాణభయం అంటే ఏమిటో తెలియదు. అతడు కత్తి దూసి, తన కేసి వస్తున్న నలుగు రైదుగురు నరభక్షకుల్ని దెబ్బ కొకడి చొప్పున కింద పడకొట్టాడు. కాని, నరభక్షకుల సంఖ్య వున్నకొందికీ అధికం అవుతున్నది. చెట్ల చాటు నుంచి మిడతల దండులా వాళ్ళు ముందుకొచ్చి పడుతున్నారు. కేశవుడూ, జయమల్లూ, వాళ్ళ వెంట వున్న కోయ యువకుడూ భయంకరంగా పోరాడుతూ క్రమ క్రమంగా గుబురుగా వున్న చెట్ల కేసి తిరోగమించసాగారు.

"జ్యేష్ఠా, కనిష్ఠా! ఇంతమంది దుర్మార్గులతో నిలబడి యుద్ధం చేసి లాభం లేదు. అడవిలోకి పరిగెత్తండి. మేమిద్దరంకూడా అదే చేయబోతున్నాం. మిమ్మల్ని ఏదో



విధంగా కలుసుకుంటాను," అంటూ ముసలివాడు పెద్దగా కేక పెట్టి, తనను చుట్టు ముట్టిన నరభక్షకుల్లో యిద్దర్ని కత్తితో నరికి, అడవి లోపలికి పరిగెత్త సాగాడు. చిన్న గడేజంగ్‌కూడా శత్రువుల మధ్య నుంచి దారి చేసుకుంటూ ముసలి వాణ్ణి అనుసరించాడు.

ఈలోపల కేశవుడూ, జయమల్లూ, కోయ యువకుడు కూడా, ఇక నరభక్షకులతో నిలిచి యుద్ధం చేయటం ప్రమాదం అని గ్రహించి, ఒకళ్ళకొకళ్ళు రక్షణగా పోరుతూ, కలిసికట్టుగా నిలబడి గుబురు చెట్ల కేసి పోసాగారు. కాని, నరభక్షకులు





మరింతగా కేకలు పెడుతూ వాళ్ళను చుట్టుముట్టేందుకు ముందుకు వస్తున్నారు.

"ఆ దుర్మార్గులందర్నీ... కేశవుడితో సహా నరకండి. వాణ్ణి ప్రాణాలతో పట్టుకోవాలని చూసి లాభం లేదు. వాడు అది అవకాశంగా తీసుకుని మనవాళ్ళ నందర్నీ ఊచకోత కోస్తున్నాడు," అంటూ చండ మండూకుడు అరిచాడు.

"కేశవుణ్ణా...చంపటమా? హాఁ, కాల భైరవా, రాకాసిలోయా!" అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు పెద్దగా మూలిగాడు.

తన అనుచరులు కేశవుడి చేతిలో చావటం చూస్తున్న మండూకుడికి, ఆ మూలుగు, ఎక్కడలేని కోపాన్నీ తెప్పించింది. వాడు కళ్ళెర్ర చేసి, తన చేతి కర్రతో బ్రహ్మదండి డొక్కలో ఒక్క పోటు పొడుస్తూ, "ముసలి మంత్రాల పీనుగా! నువ్వు, ఈ లంకకు మహమ్మారిలా దాపురించావ్. అర్ధరాజ్యం, ధనరాసులూ అంటూ నాకు ఆశ చూపి, నా అనుచరులందర్నీ, ఆ కేశవుడి కత్తికి బలి అయేలా చేస్తున్నావ్. నిన్ను బతికుండగానే చర్మం వొలిపించి, డప్పు కట్టిస్తాను," అన్నాడు.

మండూకుడి కర్ర దెబ్బ తింటూనే బ్రహ్మదండి పెద్దగా కేక పెట్టి, "నరభక్షకేశ్వరా! తమ కొయ్య కరవాలంతో అంత ధాటీగా పొడవకండి. నేను శరీరంలో ప్రాణం వుండికాక, కేవలం మంత్రాల బలంతో బతుకుతున్నాను. తమరు శెలవిచ్చినట్టు నేను, ముసలి...వయోవృద్ధుణ్ణి కాను; మంత్ర వృద్ధుణ్ణి!" అన్నాడు.

"ఏడ్చి మొత్తుకున్నావ్! అంత మంత్ర శక్తి వున్నవాడివైతే, అదుగో, ఆ కేశవుడూ వాళ్ళు, నా అనుచరుల్నుంచి తప్పుకుని అడవిలోకి పారిపోతున్నారు. వాళ్ళను నిలుపరించు, చూతాం!" అన్నాడు మండూకుడు, చేతికర్రను మరోసారి బ్రహ్మదండి డొక్కకేసి గురిపెట్టి.

బ్రహ్మదండి రెండు చేతులతో మండూ కుడికి నమస్కరించి, వణికిపోతూ, "నర భక్షక శమంతకమణీ! తమ హస్తదారుకాన్ని కాస్త వెనక్కు మళ్ళించండి. సరి... కావా లంటే ఆ కేశవుణ్ణీ వాడి అనుచరులనూ వున్న చోటునే నిలువునా భస్మం చేయ గలను. ఈ లంకను అలా గాలిలోకి లేపి క్షీరసాగరం మధ్య దించగలను. అష్టగ్రహ కూటమి కల్పించి, సముద్రాలను పొంగించి, లోకాన్ని......"

బ్రహ్మదండి వాచాలతకు రెచ్చిపోయిన చండమండూకుడు తన చేతికర్రతో అతడి భుజాన గట్టిగా ఒక్క పోటు పొడిచి, "ఇక నీ వాగుడు కట్టిపెట్టు!" అంటూ తన కేసి పరిగెత్తి వస్తున్న అనుచరులను కలుసు కునేందుకు ముందుకు నడిచాడు.

రొప్పుతూ రోస్తూ వచ్చిన నలుగురైదు గురు నరభక్షకులు తమవంటి మీది గాయా లను, చండమండూకుడికి చూపుతూ, "మహామండూకా! మా చేతనైనదంతా చేశాం. కాని ఆ దుర్మార్గులు మన వాళ్ళల్లో చాలా మందిని చంపి, మండూక పర్వతాల కేసి పారిపోయారు," అన్నారు.

చండమండూకుడు ఆ మాటలు వింటూనే నిలువెల్లా కంపించాడు. అతడికి కేశవుడూ, జయమల్లుల నుంచి తనకు







గాలించి పట్టుకురావాలి. వాళ్ళ శవాలను నాకు తెచ్చి చూపినా ఫరవాలేదు. అలా జరగక పోయిందో..." అంటూ చేతి కర్రను గట్టిగా తాటించాడు.

"ఆ కేశవుణ్ణి మాత్రం..." అంటూ ఏమో చెప్పబోయిన బ్రహ్మదండి, మండూకుడి రౌద్రాకారం చూసి గట్టిగా నోరు మూసుకున్నాడు. మండూకుడు ఆశ్చర్యంగా చుట్టూ కలయ చూసి, తరవాత బ్రహ్మదండి కేసి తల తిప్పి, "అన్నట్టు నీ అంగరక్షకు లిద్దరూ ఎక్కడా కనిపించరేం? వాళ్ళేటయినా పారిపోలేదు గదా!" అన్నాడు అనుమానంగా.

చండమండూకుడి మాటలు వింటూనే బ్రహ్మదండి ఉలిక్కి పడ్డాడు. అతడికి యింతవరకూ జిత, శక్తి వర్మలను గురించిన ఆలోచనే రాలేదు. తనను ఈ నరభక్షకులకు వదిలి, వాళ్ళిద్దరూ క్షేమంగా ఈ లంక నుంచి పారిపోయారా అన్న అనుమానం అతడికి కలిగింది. ఆ వెంటనే బ్రహ్మదండి పెద్దగా గొంతెత్తి, "జితా, శక్తీ! ఎక్కడ?" అంటూ కేక పెట్టాడు.

ఆ వెంటనే అల్లంత దూరాన వున్న చెట్ల మీది నుంచి, "వస్తున్నాం బ్రహ్మదండీ, వస్తున్నాం!" అంటూ జిత, శక్తి వర్మలు

ప్రాణగండం కలగ వచ్చున్న భయం పట్టుకున్నది. ఒకసారి వాళ్ళ నుంచి ఎలాగో చావు తప్పించుకు పారిపోగలిగాడు. పైగా వాళ్ళకు తన రహస్య సొరంగం గురించి కూడా తెలిసిపోయింది...

"ఆ దుర్మార్గులు ముగ్గురూ కొండల్లోకి పారిపోయారు! ఈ ముసలివాడూ, వాడి వెంట వున్న కోయ వెధవా, అడవుల్లోకి పారిపోయారు! ఇంతమంది మీరుండి, వాళ్ళ నెలా పారిపోనిచ్చారు?" అంటూ మండూకుడు తన అనుచరుల్ని నానా తిట్లూ తిట్టి, "ఇక వెళ్ళండి! రేపు సూర్యోదయం లోపల వాళ్ళు అయిదుగురినీ





బదులు కేక పెట్టి, కోతుల్లా కొమ్మల్లో నుంచి కిందికి దూకారు.

"ఇక్కడ యింత భయంకర పోరు జరుగుతూంటే, మీరు పిరికిపందల్లాగా చెట్లల్లో దాక్కున్నారన్నమాట!" అన్నాడు ఛండమండూకుడు కోపంగా.

"చెట్లల్లో దాక్కోవటమా! మేమా?" అంటూ జిత శక్తి వర్మలు జబ్బలు చరుస్తూ వచ్చి, "ఆ జయమల్లు ఎడమ చేతిని నరికిం దెవరు? ఆ ముసలివాడి ముక్కు ఎగిరి కిందపడేలా కత్తి విసిరిందెవరు? మేమే! మేమే!" అన్నారు.

చండమండూకుడు వాళ్ళద్దరి కేసీ అనుమానంగా చూశాడు. బ్రహ్మదండి ముఖం చిట్లించి, "అలాగా, అహా! నే ననుకుంటూనే వున్నాను. మీరు శూరులు, వీరులు! సరే, యిక వెళ్ళి ఆ దుర్మార్గులు కొండల్లోకి పారిపోయారట, వెతికి పట్టుకు రండి!" అంటూ మండూకుడు చూడకుండా వాళ్ళకు సౌంజ్ఞ చేశాడు.

బ్రహ్మదండీ, చండమండూకుడూ ఈ విధంగా యిక్కడ గొడవ పడుతూంటే, నరభక్షకుల నుంచి తప్పుకు పారిపోయిన కేశవుడూ, జయమల్లూ, కోయ యువకుడూ లంకలోని కొండ ప్రాంతాలకు చేరి, దాక్కునేందుకు అనువైన గుహ కోసం వెతకసాగారు. ఒక్క కేశవుడికి తప్ప, తతిమ్మా యిద్దరికీ నరభక్షకులతో జరిగిన పోరులో గాయాలు తగిలినై. అన్నీ చిన్న చిన్న గాయాలు, పెద్ద ప్రమాదమైనవేం కాదు. కోయయువకుడు తనకు తెలిసిన మూలికలూ, ఆకులూ కలిపి తన గాయాలకూ జయమల్లు గాయాలకూ, కట్లు కట్టాడు.

కొండ దిగువ నుంచి వస్తున్న హెచ్చరికలూ, కేకలా వల్ల నరభక్షకులు తమను పట్టుకునేందుకు కొండలు గాలిస్తున్నారని కేశవుడికీ, అతడి అనుచరులకూ తెలిసిపోయింది. కేశవుడికి తన తండ్రిని గురించిన



విచారం పట్టుకున్నది. అతడు సరభకకు లకు దొరకకుండా పారిపోయి వుంటాడా?

"కేశవా! నీ తండ్రిని గురించి దిగులు పెట్టుకోకు. అతడు మనలాగే అడవుల్లోకి పారిపోయి వుంటాడని నా నమ్మకం. ఇదుగో, మనం ఈ గుహలో దాక్కుందామా?" అంటూ జయమల్లు అక్కడ రాళ్ళలో వున్న చిన్న కంతలో నుంచి లోపలికి చూశాడు.

మనిషి పట్టీపట్టనంత సన్నగా వున్న కంతలో నుంచి మెల్లిగా జొరబడి ముగ్గురూ ఆ వెనక కొంచెం విశాలంగా వున్న గుహలోకి వెళ్ళారు.

గుహలో అడుగు పెడుతూనే కోయ యువకుడు ఎగిరి గంతేసి, "ఇక్కడేవో రెండు శవాలున్నవి!" అన్నాడు భయంగా.

జయమల్లు గుహ లోపలి భాగంలోకి పరకాయించి చూశాడు. అక్కడ అతడికి రెండు మానవ కంకాళాలు కనిపించినై. అతడు నవ్వుతూ కోయయువకుడికేసి తిరిగి, "అవి శవాలు కాదు; పట్టి బొమికల గూళ్ళు. భయపడకు. వాటికీ సున్నం పోగులకూ తేడా ఏమీలేదు, మనం..."

జయమల్లు మాట పూర్తి చేసే లోపలే 'బుస్' మంటూ పెద్ద శబ్దం అయింది. ఆ మరుక్షణాన ఫెళఫెళ మంటూ ఒక రాయి గుహ వెనక నుంచి లోపలికి దఢీ మంటూ పడింది. గుహ అంతా వెలుగుతో నిండిపోయింది. కేశవుడూ అతడి అనుచరులూ అక్కడికి పరిగెత్తి బయిటికి తొంగి చూశారు. వాళ్ళకు కలిగిన భయాశ్చర్యాలు అంతా యింతా కాదు.

ఒక మహాసర్పం, వాళ్ళు కనీ వినీ ఎరుగని ఒక భయంకర మృగంతో చావు బతుకుల పోరు జరుపుతున్నది. సర్పం కొట్టే బుసలూ, భయంకర మృగం పెట్టే అరుపులూ విని ముగ్గురూ ప్రాణభయంతో తల్లడిల్లి పోయారు. —(ఇంకా వుంది)






# విషమ పరీక్ష

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నిన్నెవరో తీవ్రమైన విషమ పరీక్షకు గురి చేసినట్టు నాకు తోస్తున్నది. ఈ పరీక్షలో నీవు నెగ్గుతావో లేదో నాకు తెలియదుగాని, నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఒక చిన్న కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

ఒకానొక రాజుకు వరుసగా నలుగురు ఆడపిల్లలు కలిగారు, కాని ఒక్కరూ ఎక్కువ కాలం బతకలేదు. తనకు ఆడ పిల్లలే తప్ప మగపిల్లలు కలగనందుకు మొదట్లో చింతించిన రాజు, పుట్టిన ఆడ పిల్లలైనా బతికి బాగుంటే చాలుననే స్థితికి వచ్చాడు. రాణి అయిదవసారి గర్భవతిగా ఉన్న సమయంలో ఆ రాజు వద్దకు ఒక గొప్ప

## బేతాళ కథలు





మంత్రవేత్త వచ్చాడు. రాజుకు వరుసగా నలుగురు కుమార్తెలు పుట్టటమూ, చని పోవటమూ జరిగిందని విని ఆ మంత్రవేత్త, "రాజా, నీకు కొడుకులు కలిగే యోగం లేదు. నీకు కలిగిన కుమార్తెలను కూడా ఒక దుష్ట శక్తి చంపేస్తున్నది. ఈసారి నీకు మళ్ళీ కుమార్తె కలుగుతుంది. కాని ఆ పిల్లకు ఏ అపాయమూ రాకుండా నేను రక్షలు కలిగిస్తాను. నీ కుమార్తెకు పదహారో ఏడు వచ్చేదాకా రాజభవనం దాటి వెళ్ళ నీయవద్దు. పదహారో ఏట ఆమెకు వివాహం చెయ్యండి. ఆమెకు వరుణ్ణి నిర్ణయించే విధంకూడా చెబుతాను. నేను చెప్పిన చోట ఒక అద్దం ఏర్పాటు చెయ్యండి. ఎవడైతే ఆ అద్దం ముందు నిలబడి అంతఃపురంలో ఉండే రాజకుమార్తెను చూడ గలుగుతాడో వాడే ఆమె భర్త. అతడి కోసం మీరు వెతక నవసరం లేదు; వాడే మీ యింటికి వస్తాడు," అని చెప్పాడు.

మంత్రవేత్త రాజభవనం చుట్టూ తన మంత్ర శక్తితో రక్షలు కల్పించాడు. రాజ భవనంలోని అతిథి గృహంలో ఒక అద్దం ఏర్పాటు చేయించాడు.

ఆయన చెప్పినట్టే రాణి తిరిగి ఆడ పిల్లనే ప్రసవించింది. ఆ పిల్లకు మేఖల అని పేరు పెట్టుకున్నారు. ఆమె మంత్ర వేత్త ఆదేశానుసారం అంతఃపురం లోనే పెరిగి పెద్దదయింది. ఆమె అపూర్వ సౌందర్యవతిగా తయారయింది. ఆమెను ఎవరూ చూడనప్పటికీ ఆమె సౌందర్యం గురించి ఎలాగో దేశదేశాలా పొక్కిపోయింది. ఆమెను చూద్దామనీ, నిజంగా అందగత్తె అయినట్టయితే పెళ్ళాడదామనీ చాలామంది రాజకుమారులు బయలుదేరి వచ్చారు.

మేఖలకు పెళ్ళి యీడు వచ్చింది గనక రాజు కూడా ఇలా వచ్చిన రాజకుమారులను తన అతిథి గృహంలో ఉంచి ఘనంగా సత్కరిస్తూ వచ్చాడు.







రాజకుమార్తెను చూడటానికీ, తమకు నచ్చితే పెళ్ళాడటానికీ వచ్చిన రాజకుమారులు తాము వచ్చిన పని తమ భృత్యుల ద్వారా బయట పెట్టేవారు. వారు తన కుమార్తెను గురించీ, ఆమె వివాహం గురించీ ప్రస్తావించగానే రాజు తన అతిథులతో, "మీరింకా నా కుమార్తెను చూసి ఉండరు. ఆ అద్దంలో చూడండి, కనిపిస్తుంది. మీకు నచ్చినట్టయితే మిగిలిన విషయాలు మాట్లాడుకోవచ్చు," అనేవాడు. అతిథులు అద్దంలోకి చూసేవారు. వారికేమీ కనిపించేది కాదు.

రాజు వారితో మంచిగా తన కుమార్తె నివ్వనని చెప్పి తన నగరం నుంచి సాగనంపుతూండేవాడు.

ఇలా కొద్ది మాసాలు గడిచినాక పుష్పార్ణ దేశపు రాజకుమారుడు వత్సరుడనేవాడు దేశసంచారం చేస్తూ సపరివారంగా ఈ దేశానికి వచ్చాడు. అతనికి మేఖల సంగతికూడా తెలియదు. రాజు అతనికి కూడా ఆతిథ్య మిచ్చి అతిథి గృహంలో బస చేయించాడు. అదివరకు వచ్చిన రాజకుమారు లందరికన్న ఈ వత్సరుడు తన కుమార్తెకు తగిన వరుడని రాజుకు అనిపించింది. కాని తన అతిథి వివాహం మాట ఎత్తేదాకా తానెందుకు తొందర పడాలని రాజు ఊరుకున్నాడు.

వత్సరుడు తన విడిది ప్రవేశించిన కొద్ది సేపటికే అతను అద్దం ముందుకు వెళ్ళటం తటస్థించింది. అతను అద్దంలోకి చూడగానే అందులో తన ముఖం కనిపించటానికి బదులు అంతఃపురంలో ఉన్న మేఖల కనిపించింది.

అసాధారణమైన ఆమె అందం కంట బడుతూనే వత్సరుడు మూర్ఛపోయాడు.

అతని మూర్ఛకు కారణం ఎవరికీ తెలియదు. అతని అనుచరులు హాహాకారాలు చేశారు. రాజుగారు అందోళన





పడుతూ వచ్చాడు. తన భృత్యులు శైత్యోపచారాలు చేసినాక వత్సరుడు లేచి కూచుని జరిగిన సంగతి చెప్పాడు. అతను అద్దంలో తన కుమార్తెను చూశాడని తెలియగానే రాజుకు సంతోషం కలిగింది. వత్సరుడు అద్దంలో తాను చూసిన పిల్లను వర్ణించినాక అతనే తన అల్లుడని రాజుకు రూఢి అయిపోయింది. ఆయన వత్సరుడితో ఉన్న సంగతంతా చెప్పి, "నాయనా, నీవే నా కుమార్తెకు విధి నిర్ణయించిన భర్తవు. నీకు అభ్యంతరంలేని పక్షంలో మీ కిద్దరికీ త్వరలోనే ముహూర్తం చూసి పెళ్ళి చేస్తాను," అన్నాడు. ఇందుకు వత్సరుడు సంతోషంగా ఒప్పుకున్నాడు. అతడి అనుచరులు చాలా ఆనందించారు.

సుముహూర్తాన వత్సరుడికీ మేఖలకూ పెళ్ళి అయింది. అత్తవారింట కొంతకాలం ఉండి వత్సరుడు భార్యతో సహా తన దేశానికి బయలుదేరాడు. వారు పడవలో ప్రయాణమై వెళుతూండగా ఒకరాత్రి ఒక చిత్రం జరిగింది.

వత్సరుడి భృత్యులలో కబరు డనే అవిటివాడు ఒకడున్నాడు. వీడు ఒకప్పుడు వత్సరుడికి అంగరక్షకుడుగా ఉండేవాడు. ఒకసారి యుద్ధంలో కబరుడు వత్సరుడి ప్రాణం కాపాడి తన ఎడమ చేతిని పోగొట్టుకున్నాడు. ఆ విశ్వాసం కొద్దీ వత్సరుడు కబరుణ్ణి తన అనుచరులలో ఒకణ్ణిగా చేసుకున్నాడు.

అందరూ పడవలో ప్రయాణిస్తూండగా ఒకరాత్రి వేళ కబరుడికి రెండు గొంతుకలు మాట్లాడుకోవటం దూరం నుంచి వినిపించినట్టు వినిపించింది.

"అత్తవారింటికి వెళుతున్న ఈ కొత్త పెళ్ళి కూతురికి మూడు గండాలు కలగబోతున్నాయి," అన్నది ఒక గొంతు.

"ఆ గండాలేవి?" అని మరొక గొంతు అడిగింది.

"వీరు గమ్యస్థానం చేరి పడవ దిగగానే నది ఒడ్డున రాజకుమారు డొక బంగారు రంగు గల గుర్రాన్ని చూస్తాడు. దాన్ని ఎక్కాలని అతనికి కుతూహలం కలుగుతుంది. అతను దాన్ని ఎక్కగానే అది మాయమవుతుంది. భర్త కోసం దిగులు పడి రాజకుమార్తె మరణిస్తుంది," అన్నది మొదటి గొంతు.

"అయ్యో, దీనికి విరుగుడులేదా?" అని రెండో గొంతు అడిగింది.

"ఒకటే విరుగుడు; ఎవరైనా. ఆ సమయానికి అక్కడ ఉండి, రాజకుమారుడు ఎక్కే లోపుగా కత్తితో ఆ గుర్రాన్ని చంపెయ్యాలి. ఇలా మొదటి గండం తప్పినా రెండో గండం ఉండనే ఉన్నది. అదేమంటే, వీరు ఇంటికి రాగానే కట్టుకోవటానికి కొత్త బట్టలిస్తారు. వాటిలో బంగారు పోగులతో నేసిన వస్త్రం రాజకుమార్తెను ఆకర్షిస్తుంది. ఆమె దానిని ధరించగానే నిలువునా కాలి బూడిద అవుతుంది. ఆమె దానిని ధరించే లోపుగా ఎవరైనా ఆ వస్త్రాన్ని తీసుకుని నిప్పులో వేసేస్తే ఆ గండం కూడా తప్ప వచ్చు," అన్నది మొదటి గొంతు.

"మూడో గండం ఏమిటి?" అని రెండో గొంతు అడిగింది.



"కోడలి మెడలో అత్తగారు ఒక పచ్చల హారం వేస్తుంది. ఆ హారంలో ఉండే ఒక కీటకం రాజకుమార్తెను కరుస్తుంది. ఆ కాటుకు రాజకుమార్తె మరణిస్తుంది. ఆ సమయంలో ఎవరైనా రాజకుమార్తె చేతి రక్తం తీసి, మూడు బొట్లు ఆమె కళ్ళలో వేసినట్టయితే ఆ గండం కూడా తప్పుతుంది. ఆ తరవాత ఆమెకు ఎలాటి ప్రమాదమూ ఉండదు. కాని ఈ గండాల రహస్యం ఎవరికైనా తెలిసినప్పటికీ వారు దాన్ని ఇంకెవరికీ చెప్పకూడదు. చెప్పినట్టయితే వారు శిల అయిపోతారు!" అన్నది మొదటి గొంతు.



లోపుగా కబరుడు కత్తితో దాని మెడ ఒక్క వేటున నరికేశాడు.

"ఏం పని చేశావు? ఎందుకిలా చేశావు?" అని రాజకుమారుడు కబరుడిపైన విసుక్కున్నాడు.

"మంచికే చేశాను; నన్నేమీ అడగవద్దు!" అని కబరుడు మొండిగా అతడికి జవాబిచ్చాడు.

రాజభవనంలో నూతన దంపతుల కోసం కొత్త బట్టలు తెప్పించారు. అందులో ఒకటి అచ్చమైన జరీ బట్ట. మేఖల దాన్ని తీసుకునే లోపల కబరుడు ఆ బట్టను తీసుకుని పరిగెత్తిపోయి పాకశాలలోని అగ్ని గుండంలో వేసేశాడు.

ఆ సంభాషణ అక్కడితో నిలిచిపోయింది. కబరుడు తాను విన్న విషయాలకు మొదట ఆశ్చర్యపోయాడు. తన యువరాజు భార్యకు గండాలు కలగబోతున్నాయని భయపడ్డాడు. ఆ తరవాత వాటిని తానే తొలగించటానికి నిశ్చయించుకుని, తనకీ సంగతి ముందుగానే తెలిసినందుకు సంతోషించాడు. తాను విన్న ఆ సంభాషణ పడవలో మరెవరికీ వినిపించలేదని కబరుడు గ్రహించాడు.

అంతా కబరుడు విన్నట్టే జరిగింది. రాజకుమారుడు పడవలో నుంచి దిగుతూండగానే ఒడ్డున బంగారంలా మెరిసిపోయే గుర్రం కనిపించింది. కాని అతను దాన్ని ఎక్కే

ఈసారి వత్సరుడికి కబరుడిపైన మరింత కోపం వచ్చింది. కాని కబరుడు వెనకటిలాగే, "అంతా మంచికే చేశాను; నన్నేమీ అడగవద్దు," అని పెడసరంగా జవాబు చెప్పినట్టు చెప్పాడు.

ఇంతలోనే వత్సరుడి తల్లి పచ్చలహారం తెచ్చి తన కోడలి మెడలో వేసింది. ఆ హారం మెడలో వేసుకున్న మరుక్షణమే మేఖల స్పృహ లేకుండా పడిపోయింది. అందరూ కొయ్యబారి చూస్తూండగా కబరుడు చప్పున తన చాకు తీసి, మేఖల చేతిని

దాని మొనతో గీరి, రక్తం తీసి మేఖల కంట్లో వేశాడు.

మేఖల మరణించినట్టు అంతవరకూ ఎవరూ గమనించలేదు. తీరా ఆ సంగతి తెలిసినాక ఆమెను కబరుడే చంపాడని వత్సరుడికి అనుమానం కలిగింది.

"ఈ దుర్మార్గుణ్ణి బంధించి తల తీయండి!" అని అతను తన భటులతో చెప్పాడు.

"రాజకుమార్తె ప్రాణాని కేమీ భయం లేదు. ఆమె బతుకుతుంది," అని కబరుడు ధైర్యంగా చెప్పాడు.

కొంతసేపు చూశారు. కాని మేఖలకు ప్రాణం తిరిగి రాలేదు.

"వీడికి పిచ్చి పట్టింది. ఎలాగైనా వీడు బతికి ఉండటం ప్రమాదమే; తల తీసెయ్యండి!" అన్నాడు వత్సరుడు.

తనకు ఎలాగూ చావు తప్పదని తెలుసుకుని కబరుడు తాను పడవ ప్రయాణంలో విన్న సంగతులూ, వాటిని బయట పెడితే తనకు జరిగే నష్టమూ వివరంగా చెప్పి, నిలుచున్న చోటనే శిల అయిపోయాడు.

కబరుడు శిల అయిపోయిన తరవాత మేఖలలో చైతన్యం వచ్చింది. త్వరలోనే ఆమె బ్రతికి లేచి కూర్చున్నది. నిష్కారణంగా కబరుణ్ణి తన అజ్ఞానానికి బలి



ఇచ్చినందుకు వత్సరుడు పొందిన దుఃఖం ఇంతా అంతా కాదు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. మేఖలకు ఇద్దరు కుమారులు కలిగారు. కాని వత్సరుడికి సంపూర్ణమైన ఆనందం పొందే అవకాశంలేకుండా కబరుడి శిల ఎదురుగా కనిపిస్తూ ఉండేది. భార్యా భర్త లిద్దరూ తరుచు ఆ శిల వద్ద కూచుని, జరిగినది తలుచుకుని విచారపడేవారు.

ఒకరోజు వారిద్దరూ ఆ శిల వద్ద కూచుని కబరుణ్ణి గురించి మాట్లాడుకుంటూండగా ఏదో గొంతు వినపడింది. వారు మాటలు మాని ఆలకించారు.

"కబరుడి కోసం ఎందుకిలా విచారిస్తారు? మీ కొడుకు లిద్దరినీ బలి ఇస్తే కబరుడు బతికి వస్తాడు!" అన్నదా గొంతు.

ఈ మాట వింటూనే వత్సరుడు తన పిల్ల లిద్దరినీ తీసుకు వచ్చి తన కత్తితో వారిద్దరి తలలూ నరకబోయాడు. అంతదాకా శిలలాగా ఉండిన కబరుడు చప్పున కేక పెట్టి, "అయ్యోయ్యో, ఆగండి, ఆగండి!" అంటూ పిల్ల లిద్దరినీ తన దగ్గిరికి లాక్కున్నాడు.

కబరుడు బతికి వచ్చినందుకు వత్సరుడూ, మేఖలా కూడా ఎంతో సంతోషించారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక్కటే సందేహం; వత్సరుడు తన పిల్లలను బలి ఇవ్వకుండానే కబరుడు ఎలా బతికి వచ్చాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మేఖలకు తప్పిన గండాలు మొదలుకుని వైపరీత్యాలన్నీ వత్సరుడికి పరీక్షలుగా భావించాలి. మొదటిసారి అతను పరీక్షలో నెగ్గలేక పోవటం చేత విశ్వాస పాత్రుడైన కబరుణ్ణి కోల్పోయాడు. అందుకతను పశ్చాత్తాప పడ్డాడు. ఆ పశ్చాత్తాపం ఎంతవరకు వాస్తవమో చూడటానికి అమానుష శక్తులు మరొక పరీక్ష పెట్టాయి. అందులో అతను నెగ్గాడు. వత్సరుణ్ణి పరీక్షించిన అమానుష శక్తులు చెడ్డవి కావు. వాటికి కావలిసినది వత్సరుడి పిల్లలను బలి కొనటం కాదు, వత్సరుడి శీలం ఎలాటిదో తెలుసుకోవటమే! అందుకే, వారి ప్రాణాలకు అపాయం కలగకుండానే కబరుడు తిరిగి బతకటం జరిగింది," అన్నాడు

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# చ్యవనుడి కథ

భృగుడు పురాణాలలో ప్రసిద్ధి కెక్కిన వాడు. ఈయన బ్రహ్మ హృదయంలో నుంచి పుట్టాడు. ఈయన పెద్ద భార్యకు కవి అనే కొడుకు పుట్టాడు. ఆ కవి కొడుకే దానవుల గురువైన శుక్రాచార్యుడు. ఒకసారి రాక్షసులను దేవతలు తరుముకురాగా భృగు పత్ని వారిని కాపాడిందట. అప్పుడు దేవతల పక్షాన విష్ణువు వచ్చి తన చక్రాయుధంతో భృగుడి భార్యను చంపేశాడు. భృగుడు విష్ణువుపై అలిగి, "నీవు మానవ జన్మ మెత్తి భార్యావియోగం అనుభవించు," అని శపించాడట. దాని ఫలితంగా విష్ణువు రాముడై పుట్టి సీతావియోగం అనుభవించాడట.

భృగుడికి ఇంకా ఇతర భార్యలుండే వారు. వారిలో పులోమ అనే ఆమె ఒకతె. ఒకనాడు భృగుడు పులోమను అగ్ని గృహంలో అగ్నికార్యాలు చూస్తూండమని చెప్పి తాను ఎటో వెళ్ళాడు. ఆ సమయంలో పులోము డనే రాక్షసుడు వచ్చి, పులోమను చూసి, అగ్నిని, "ఈమె ఎవరు?" అని అడిగాడు. "ఈమె పేరు పులోమ. భృగుడి భార్య," అని అగ్ని సమాధానం చెప్పాడు.

అది విని పులోముడు, "ఈమెను నేను మొదట వరించాను. తరవాత ఈమెను భృగుడు పెళ్ళాడేశాడు," అంటూ పంది రూపం ధరించి, గర్భవతిగా ఉన్న పులోమను ఎత్తుకుని పారిపోసాగాడు. అప్పుడామె గర్భంలో ఉన్న శిశువు అలిగి, బయటికి వచ్చి, పులోముణ్ణి తీక్షణంగా చూసేసరికి పులోముడు నిలువునా కాలి బూడిద అయిపోయాడు. ఆ శిశువే చ్యవనుడు; అద్భుతశక్తులు గలవాడు.

చ్యవనుడు అనేక సంవత్సరాలపాటు ఘోరతపస్సు చేశాడు. అతని చుట్టూ పుట్టలు పెరిగిపోయాయి.



వైవస్వతమనువు కుమారుడైన శర్యాతి అనే రాజు తన కుమార్తె అయిన సుకన్య తోనూ, సైనిక పరివారంతోనూ అరణ్యంలో సంచరిస్తూ చ్యవనుడు తపస్సు చేసుకునే ప్రాంతానికి వచ్చాడు. చ్యవనుడి చుట్టూ ఉన్న పుట్ట నుంచి మెరుపులాటి కాంతులు రావటం గమనించి సుకన్య తమ సేవకుల చేత పుట్టను తవ్వించింది. అలా తవ్వ టంలో చ్యవనుడి శరీరానికి గాయం తగిలి రక్తం వచ్చింది. చ్యవనుడికి కోపం వచ్చి, శర్యాతి సేనలకు మలమూత్రాలు రాకుండా చేశాడు. సైనికులు భరించరాని బాధకు గురి అయారు.



సుకన్య చేసిన తప్పువల్లనే తన సైనికు లకు ఈ యిక్కట్టు వచ్చినట్టు తెలుసుకుని, శర్యాతి, చ్యవను డున్న చోటికి వెళ్ళి క్షమాపణ వేడాడు. తన కుమార్తె పసితనం చేత తెలియక తప్పు చేసిందని అతడికి విన్నవించుకున్నాడు.

"నీ కుమార్తెను నా కిచ్చి పెళ్ళి చేస్తే నా కోపం ఉపసంహరించు కుంటాను," అన్నాడు చ్యవనుడు. శర్యాతి ఇందుకు ఒప్పుకుని సుకన్యను చ్యవనుడి కిచ్చి చేశాడు. చ్యవనుడు వయసు మళ్ళినవాడు, ముక్కోపి. అయినప్పటికీ సుకన్య తన భర్తను ఎంతో భక్తి శ్రద్ధలతో కొలిచి ఆయన అభిమానాన్ని సంపాదించుకున్నది.

ఒకనాడు అశ్వినీ దేవతలు చ్యవనుడి ఆశ్రమానికి వచ్చారు. చ్యవనుడు వారితో, "మీరు నా ముసలితనం పోగొట్టి యౌవన మిచ్చినట్టయితే శర్యాతి చేయబోయే యజ్ఞంలో మీకు సోమపానం ఇప్పించి, యజ్ఞభాగం దక్కేలాగుచేస్తాను," అన్నాడు. వారందుకు ఒప్పుకుని, "మేము చెప్పిన ప్రకారం చెయ్యి, నీకు యౌవనం ఇప్పి స్తాము," అన్నారు.

వారు చ్యవనుడితో ఏమి చెయ్యాలో చెప్పి, సుకన్య వద్దకు వెళ్ళి, "అమ్మా,





నీవు పడుచుదానవు. ఈ ముసలి భర్తతో ఎందుకు కాపరం చేస్తావు? మా వెంట వచ్చినట్టయితే నీకు నవయౌవనుడైన భర్తను చూపిస్తాము," అన్నారు.

సుకన్య ఈ మాటలు విని మండిపడి చ్యవనుడితో చెప్పింది. చ్యవనుడు ఏ మాత్రమూ ఆగ్రహించక, "వారు చెప్పినట్టే చేసి యువకుడైన భర్తను సంపాదించుకో," అన్నాడు.

అప్పుడు సుకన్య అశ్వినీ దేవతల వద్దకు వచ్చి, "మీ వెంట వస్తాను, మీరు చెప్పినట్టు నాకు యౌవనవంతుడైన భర్తను చూపండి," అన్నది.

అశ్వినీ దేవతలు ఆ సమీపంలో ఉన్న కొలనులో మునిగారు. అదే సమయంలో చ్యవనుడు కూడా వచ్చి ఆ కొలనులోనే మునిగాడు. తరవాత ముగ్గురూ అందమైన యువకులుగా మారిపోయి కొలనులో నుంచి పైకి వచ్చి సుకన్య ఎదట నిలిచారు. వారిలో తన భర్త ఎవరో తెలుసుకోలేక, సుకన్య తన భర్తను చూపమని అశ్వినీ దేవతలను ప్రార్థించింది. వారు ఆమెకు చ్యవనుణ్ణి చూపారు. అది మొదలు సుకన్య యౌవనవంతుడైన చ్యవనుడితో తమ ఆశ్రమంలో సుఖంగా కాపరం చేస్తూ వచ్చింది.

కొంతకాలం గడిచింది. శర్యాతి తన కూతురినీ, అల్లుణ్ణీ పిలుచుకు పోదామని వచ్చాడు. తన కుమార్తె తన ముసలి భర్తతో కాపరం చేస్తూ ఉండటానికి బదులు ఎవడో కుర్రవాడితో కులుకుతూ ఉండటం చూసి ఆమె శీలం చెడిపోయిందని అపోహ పడి దుఃఖించాడు. సుకన్య తన తండ్రితో, ఆ సుందరాకారుడైన యువకుడు తన భర్త అయిన చ్యవనుడేననీ, అశ్వినీ దేవతల అనుగ్రహం చేత యౌవనవంతుడయాడనీ చెప్పి ఆయనకు సంతోషం కలిగించింది.

శర్యాతి యజ్ఞం చేశాడు. చ్యవనుడు తాను అశ్వినులకు ఇచ్చిన మాట ప్రకారం

హవిర్భాగం ఇప్పించబోతే, వారు అందుకు అర్హులు కారని ఇంద్రుడు అభ్యంతరం చెప్పాడు. చ్యవనుడు ఇంద్రుణ్ణి లక్ష్యపెట్టక వారి భాగం వారి కిప్పించాడు. ఇంద్రుడికి కోపం వచ్చి వజ్రాయుధం ఎత్తి చ్యవనుణ్ణి కొట్టబోయాడు. ఇంద్రు డెత్తిన చెయ్యి అలాగే స్తంభించిపోయేటట్టు చేశాడు చ్యవనుడు. అంతటితో పోనివ్వక చ్యవనుడు హోమం చేసి మందుడనే రాక్షసుణ్ణి ఉద్భవింపజేశాడు. ఆ రాక్షసుడు కాస్తా అక్కడ చేరిన దేవతలను మింగబోయాడు. ఇంద్రుడు బెదిరిపోయి చ్యవనుడి కాళ్ళు పట్టుకున్నాడు. ఇంద్రుడి ప్రతాపం అణి గాక ఇతర దేవతలతో బాటు అశ్వినులు కూడా సోమపానం చేశారు.

ఒకప్పుడు చ్యవనుడు గంగా యమునా సంగమం వద్ద నీటిలో మునిగి పన్నెండేళ్ళు తపస్సు చేశాడు. అప్పుడు బెస్తవాళ్ళు వచ్చి అక్కడ వలవేసి లాగేసరికి, వారికి చేపలతో బాటు చ్యవనుడు కూడా దొరికాడు. ఆయనను చూసి బెస్తలు క్షమాపణ వేడుకున్నారు. ఆయన వారితో, "ఈ చేపలు పన్నెండేళ్ళుగా నాతో కలిసి జీవించాయి, స్నేహం చేశాయి. వీటితోబాటు నన్నుకూడా తీసుకుపోయి అమ్మండి," అన్నాడు.



ఆ బెస్తలు తమ రాజైన నహుషుడనేవాడి వద్దకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పారు. నహుషుడు వచ్చి చ్యవనుడితో బెస్తలను మన్నించమని వేడుకున్నాడు. "వారి కుల ధర్మం వారు చేశారు. అందులో తప్పేమీ లేదు. కావలిస్తే వారికి నా శరీరం వెల యిచ్చి నన్ను విడిపించు," అన్నాడు చ్యవనుడు రాజుతో.

"ఈ బెస్తలకు వెయ్యి మాడ లిచ్చి పంపెయ్యండి," అని రాజు తన భృత్యులను ఆజ్ఞాపించాడు.

"అది నాకు సరి అయిన వెల కాదు," అన్నాడు చ్యవనుడు.

రాజు కోటి మాడ లిస్తానన్నాడు, అర్ధ రాజ్యం ఇస్తానన్నాడు, తన రాజ్యమంతా కూడా ఇస్తానన్నాడు. కాని ఇవేవీ తనకు సరిఅయిన మూల్యం కాదన్నాడు చ్యవనుడు.

రాజు ఏమి చెయ్యటానికీ తోచక తికమక పడుతూండగా గవిజాతు డనే ముని వచ్చి రాజుతో, "బ్రాహ్మడికీ గోవుకూ ఒకటే విలువ. బెస్తలకు ఒక గోవు నిచ్చి చ్యవనుణ్ణి విడిపించు," అని సలహా ఇచ్చాడు. తనకు మారుగా ఒక గోవు నిస్తానని రాజు అనగానే చ్యవనుడు తృప్తిపడ్డాడు.

రాజు వద్ద గోవును పుచ్చుకున్న బెస్తలు దానిని చ్యవనుడికే దానం చేశారు. చ్యవనుడు సంతోషించి, బెస్తలకూ, చేపలకూ కూడా ఉత్తమ లోకాలు కలిగేటట్టు ఆశీర్వదించాడు.

ఒకప్పుడు దేవతలు తమలో తాము మాట్లాడుకుంటూ భృగు వంశమూ, కుశిక వంశమూ కలిసిపోతాయని చెప్పుకుంటూంటే చ్యవనుడు విన్నాడు. అలా జరిగితే తమ వంశం సంకరమైపోతుందని అతడికి బాధ కలిగింది. ఏదో మిషమీద కుశిక వంశాన్ని నిర్మూలించాలని నిశ్చయించుకుని చ్యవనుడు కుశికుడి ఇంటికి వెళ్ళాడు. రాజూ, రాణీ కూడా ఆయనకు ఆతిథ్య మిచ్చి, తమ నుంచి ఏమి సేవలు కావాలో కోరుకో



మన్నారు. చ్యవనుడు వారి చేత సమస్త సేవలూ చేయించుకుని, "నేను నిద్ర పోతాను. నిద్రలేచే దాకా నాకు మీరిద్దరూ కాళ్ళు పట్టండి. నేనై నిద్రలేచే దాకా నాకు నిద్రాభంగం కలగకుండా మాత్రం జాగ్రత్తగా చూడండి," అన్నాడు.

చ్యవనుణ్ణి అంతఃపురంలో పక్క మీద పడుకోబెట్టి కుశికుడూ, అతని భార్యా కాళ్ళు ఒత్తసాగారు. ఆ పడుకోవటం చ్యవనుడు ఇరవైఒక్క రోజు నిద్రపోయాడు. అంత కాలమూ నిద్రాహారాలు మాని రాజ దంపతులు అయనకు కాళ్ళు పట్టుతూనే ఉన్నారు. ఆ తరవాత చ్యవనుడు నిద్ర లేచి వారిని పలకరించకుండానే బయటికి వెళ్ళిపోయాడు. రాజదంపతులు ఆయన వెనకనే వెళ్ళారు. కొంతదూరం వెళ్ళినాక చ్యవనుడు అదృశ్యుడయాడు. చేసేదిలేక కుశికుడూ, అతని భార్యా అంతఃపురానికి తిరిగివచ్చి, చ్యవనుడు పక్క మీదనే నిద్ర పోతూండటం చూసి ఆశ్చర్యపడి, యథా ప్రకారం ఇద్దరూ అతనికి కాళ్ళు పట్టుతూ కూచున్నారు.

చివరకు చ్యవనుడు నిద్రలేచాడు. రాజ దంపతులు అతనికి తలంటి స్నానం చేయించారు. "నన్ను రథం మీద కూచోబెట్టి మీ రిద్దరూ లాగండి," అని చ్యవనుడు వారి



నడిగాడు. ఆ ప్రకారమే వాళ్ళు ఆయనను ఒక రథంలో కూచోబెట్టి, తమ మెడలకు తాళ్ళు తగిలించుకుని రథాన్ని లాగారు. లాగుతున్నంతసేపూ చ్యవనుడు వారిని ముల్లుకర్రతో పొడిచాడు. వారిద్దరి దేహాలూ రక్తంతో తడిసిపోయాయి.

తాను ఇంత చేసినా ఆ రాజదంపతుల సహనశక్తి నశించకపోవటం చూసి చ్యవనుడు ఆశ్చర్యపడి రథం దిగి వారి శరీరాలు తాకాడు. వెంటనే వారి గాయాలు పోయాయి, బడలిక పోయింది, ఇద్దరూ యౌవనవంతులయారు. వారితో చ్యవనుడు, "నేను జపం చేసుకోవటానికి గంగా తీరానికి వెళుతున్నాను. రేపు మీ రిద్దరూ అక్కడికి రండి," అని చెప్పి వెళ్ళిపోయాడు.

మర్నాడు కుశికుడూ అతని భార్యా గంగా తీరాన చ్యవనుడి వద్దకు వెళ్ళారు. చ్యవనుడు తన యోగశక్తితో వారికి స్వర్గాన్నీ, అక్కడి భవనాలనూ చూపాడు. వారా భవనాలలో ప్రవేశించారు. అంతలోనే చ్యవనుడు అంతా మాయం చేశాడు. తరవాత ఆయన ఆ దంపతులను ఏం కావాలో కోరుకోమన్నాడు.

కుశికుడు చ్యవనుణ్ణి, "మీరు అంత కాలం ఎందుకు నిద్రపోయారు?" అని అడిగాడు.

"మా వంశమూ, మీ వంశమూ కలియనున్నట్టు తెలిసి, అవకాశం దొరికితే మీ వంశాన్ని శపించి నిర్మూలిద్దామని మీకీ పరీక్షలన్నీ పెట్టాను. కాని మీరు నాకా అవకాశం ఇవ్వలేదు. మీ మనమడు బ్రహ్మతేజస్సు గల వాడవుతాడు," అని చ్యవనుడు ఆ దంపతులకు చెప్పాడు.

విశ్వామిత్రుడే కుశికుడి మనమడు. కుశికుడికి గాధి పుట్టాడు. గాధికి విశ్వామిత్రుడు పుట్టి, జన్మచేత క్షత్రియుడైనప్పటికీ బ్రహ్మర్షి అని దేవతల చేతా, మానవుల చేతా అనిపించుకున్నాడు.





# గంధర్వ చక్రవర్తి కూతురు

2

హసన్ దుర్మరణం నుంచి తప్పించు కోవటమే గాక తన శత్రువైన ఇబ్రహీంను కూడా తుదముట్టించి విముక్తుడయాడు. అతను తన చేతిలో ఉన్న తప్పెటను తిప్పి తిప్పి చూశాడు, కాని దాన్ని ఎలా ఉపయో గించేదీ తెలుసుకోలేక, చేతగాక ఏం చేస్తే ఏం జరుగుతుందోనని సంశయించి, దానిని తన రొండిన కట్టుకుని, చుట్టూ ఒకసారి కలయ జూశాడు.

అతనున్న కొండ శిఖరం మబ్బుల కన్న ఎత్తుగా ఉన్నప్పటికీ, ఆ ప్రాంతం చాలా విశాలమైన సమప్రదేశంగా ఉన్నది. ఎక్కడా ఒక చెట్టుగాని, పొదగాని లేదు; బ్రహ్మాండమైన రాతి మైదానం. ఈ మైదానం ఒక చివర హసన్ ఉన్నాడు. దాని రెండో చివర అతనికి మంటలు ప్రకాశిస్తున్నట్టు కనిపించింది. మనిషిలేనిచోట మంట లుండ వనుకుంటూ హసన్ ఆ మంటల కేసి నడవ నారంభించాడు.

అతను దగ్గిరికి వచ్చిన కొద్దీ ఆ మంటలు ఒక పెద్ద భవనంగా మారాయి. ఆ భవ నానికి నాలుగు బ్రహ్మాండమైన స్తంభా లున్నాయి, వాటిపైన ఒక గుండ్రని గుమ్మటం ఉన్నది. స్తంభాలకూ, గుమ్మ టానికీ, భవనానికీ బంగారు రేకు తొడిగి ఉన్నది. సూర్యకాంతి ఈ బంగారు భవనం పైన పడటం చేత హసన్ మంటలు కని పించాయని భ్రమపడ్డాడు.

హసన్ మానసికంగానూ, శారీరకంగానూ బాగా బడలి ఉన్నాడు. "ఈ భవనం మనుషు లుండేదికాదు. ఏ యక్షులో, గంధర్వులో ఉండేది. అయితే అయింది.

సి. మాధవరావు



ద్వారపాలకుణ్ణి వేడుకుని మంచి నీరడుగుతాను. ఏ మూలనన్నా నడుం వాల్చనిస్తే నిద్రపోతాను," అనుకుంటూ హసన్, పచ్చరాతిలో మలిచిన ద్వారం కుండా భవనప్రాంగణంలోకి అడుగు పెట్టాడు.

అతను కొద్ది అడుగులు నడిచాడో లేదో, ఇద్దరు కన్యలు ఒక చలవరాతి బల్లమీద కూచుని చదరంగం ఆడుతూ కనిపించారు. మొదట వాళ్ళు హసన్‌ను చూడలేదుగాని, కొంతసేపటికి వారిలో చిన్నది తల ఎత్తి, తమ సమీపాన నిలబడి ఉన్న యువకుణ్ణి చూసి, "అక్కా, ఎవరో అబ్బాయి వచ్చాడు చూడు. దుర్మార్గుడు బెహ్రాం ఏటా ఇలాటి యువకుల్ని మబ్బుల కొండపైకి తెస్తూంటాడు. ఈ అబ్బాయిని కూడా వాడే తెచ్చాడేమో! అలా అయితే ఇతను ఆ మాయదారి వాడి నుంచి ఎలా తప్పించుకుని ఉంటాడు?" అన్నది.

హసన్ ఆమె కాళ్ళపై బడి, "అమ్మా, నేను అలాటి అభాగ్యుణ్ణే!" అంటూ కంట తడి పెట్టుకున్నాడు. అతని దుస్థితి అర్థమై ఆమెకు హసన్ పైన ఎక్కడలేని జాలీ పుట్టుకొచ్చింది.

ఆమె తన అక్కతో, "అక్కా, నేనీ కుర్రవాణ్ణి నా తమ్ముడుగా పెంచుకోబోతున్నాను. అందుకు నీవే సాక్షి," అన్నది.

తరవాత ఆమె హసన్‌ను భవనంలోకి తీసుకుపోయి, సుఖంగా స్నానం చేయించి, అతని పాత దుస్తులు అవతల పారేయించి, మంచి దుస్తులు కట్ట బెట్టింది

ఆ తరవాత ఆ అక్క చెల్లెళ్ళు హసన్‌ను తమ మధ్య కూచోబెట్టుకుని భోజనం చేయించారు.

ఈ తతంగమంతా ముగిసినాక హసన్ వారితో, "అక్కలారా, నాకు మీరు తటస్థపడే అదృష్టం కలగక పూర్వం నేను చాలా కష్టాలు పడ్డాను," అంటూ తన కథ యావత్తూ చెప్పాడు.

అతను తన కథ పూర్తి చేసినాక అతన్ని పెంచుకున్న ఆమె తమ కథ అతనితో ఇలా చెప్పింది :

"మేమొక గంధర్వ రాజు కుమార్తెలం. అందరమూ కలిసి ఏడుగురము. అందరమూ ఒక తండ్రి బిడ్డలమేగాని ఒక తల్లి బిడ్డలం కాము. అందరిలోకీ నేనూ, మా అక్క చిన్నవాళ్ళం. మిగిలిన మా అయిదుగురు అక్కలూ వేటకి వెళ్ళారు. త్వరలోనే తిరిగి వస్తారు. మా అక్క చెల్లెళ్ళను పెళ్ళాడే అర్హత గలవాళ్ళెవరూ సృష్టిలోనే లేరని మా తండ్రిగారి నమ్మకం. మేము శాశ్వతంగా కన్యలుగానే ఉండి పోవాలని ఆయన నిర్ణయించి, మేము ఉండటానికిగాను ఈ మారుమూల ప్రదేశంలో ఈ భవనం కట్టించారు. ఈ ప్రదేశమటుకు చాలా మనోహరమైనది. జలసమృద్ధి గలది. ఎక్కడ చూసినా పూల చెట్లూ, పళ్ళ చెట్లూ కనిపిస్తాయి. చక్కని సరస్సు లున్నాయి. వాటిలో రాజహంస లున్నాయి. స్వర్గంలాటి ఈ ప్రదేశంలో మేము చాలా సుఖంగా ఉన్నాము. మాకు ఒక్కటే కొరత ఉండేది—ఎంత కాలం గడిచినా మాకు మా ముఖాలు తప్ప కొత్త ముఖాలు కనిపించవు. అదృష్టం కొందికి నువ్వు యిక్కడికి రావటంతో మాకు



ఆ లోటుకూడా తీరింది. ఇది మాకు అమితానందకరమైన సంగతి."

ఆమె తన తమ్ముడితో ఇలా కబుర్లు చెబుతూండగానే మిగిలిన అయిదుగురు రాకుమార్తెలూ వేట నుంచి తిరిగివచ్చారు. తలవని తలంపుగా తమ కొక తమ్ముడు దొరికినందుకు ఎంతో సంతోషించి, వారతని చేత చాలాకాలం ఉంటానని అతని దగ్గిర వాగ్దానం పుచ్చుకున్నారు.

హసన్ అక్కడి వింతలన్నీ చూస్తూ ఆ గంధర్వరాజు కుమార్తెల వెంట ఉండి పోయి, వారితో షికార్లకూ, వేటకూ వెళ్ళాడు. ఆ అక్కలను చూసుకుని అతనెంత



గర్వించాడో అతన్ని చూసుకుని వారూ అంత ఆనందించారు. వాగుల వెంబడీ, తోటల్లోనూ ఆడుతూ, ఒకరి ప్రపంచం గురించి ఒకరు విచిత్ర విషయాలు తెలుసుకుంటూ ఆ ఎనిమిది మందీ ఒక తల్లి కన్న పిల్లల్లాగా అన్యోన్యంగా మసలుకున్నారు.

ఒకనాడు అందరూ పొదల మధ్య చేరి పాటలు పాడుకుంటూండగా ఒక్కసారిగా ఆకాశంలోకి దుమ్ములేచి సూర్యబింబాన్ని ఆవరించేసింది. అదే సమయంలో ఉరుము లాటి ధ్వని వారి కేసి వచ్చింది. రాజకుమార్తె లంతా భయపడిన వారిలాగా హసన్‌తో, "ఎటన్నా వెళ్ళి దాక్కో!" అన్నారు. కడ గొట్టు రాజకుమార్తె హసన్‌ను చెయ్యి పట్టుకుని తోటలో ఒక చోటికి తీసుకుపోయి దాక్కొబెట్టింది.

త్వరలోనే గంధర్వుల బలగం ఒకటి వచ్చి భవనం దగ్గిర వాలింది. మరొక గంధర్వరాజు గౌరవార్థం రాజకుమార్తెల తండ్రి విందు చేస్తున్నాడట, తన కుమార్తెలను తీసుకురమ్మని ఆయన తన పరివారాన్ని పంపాడు. ఈ వార్త తెలియగానే కడగొట్టు రాజకుమార్తె హసన్ వద్దకు వచ్చి, "తమ్ముడూ, నిన్ను ఒంటరిగా విడిచి మేము కొన్ని రోజులపాటు వెళ్ళిపోవలిసి వచ్చింది. ఇవిగో తాళపుచెవులు. మేము తిరిగివచ్చేదాకా ఈ భవనమంతా నీదే. కాని ఒక్క విషయం జాగ్రత్త—ఈ తాళపు చెవితో తెరుచుకునే గదిలోకి మాత్రం ప్రవేశించకు," అని నీలపురాయి పొదిగిన తాళపు చెవి అతనికి చూపింది.

తరవాత ఏడుగురు రాజకుమార్తెలూ అతని వద్ద సెలవు తీసుకుని, తమ కోసం వచ్చిన వారి వెంట తమ తండ్రి ఇంటికి వెళ్ళిపోయారు.

వారు వెళ్ళాక భవనమంతా బిక్కు బిక్కుమంటూ బోసిపోయినట్టున్నది. హసన్ కాలుగాలిన పిల్లిలాగా గదులన్నీ తిరిగి, తన

అక్కలు వాడే వస్తువులూ, వారు తిరిగే చోట్లూ చూసి వేదన పడ్డాడు. అలా తిరుగుతూ తిరుగుతూ అతను తెరవరాని తలుపు వద్దకు వచ్చాడు. దాన్ని తెరవరాదన్న సంగతి జ్ఞాపకం వచ్చి అతను వెనక్కు వెళ్ళిపోయాడు.

అయితే అతని తలలో ఆలోచనలు వెనక్కు తిరగలేదు: "ఈ తలుపు తెరవ రాదనటానికి కారణం ఏమై ఉంటుందీ? ఆ గదిలో ఏమి వింత ఉండవచ్చును? ఏమైనా ఆ గదిలోకి పోనని మాట ఇచ్చాను గద!" ఇలా అనుకుని కూడా ఆ తలుపును అతను మరవలేకపోయాడు. దాన్ని గురించిన ఆలోచనలతో అతనికి నిద్ర కూడా పట్టలేదు. ఏమైతే అయింది, ఆ తలుపు తెరుద్దామనుకున్నాడు. పోనీ తెల్లవారిన దాకా ఆగుదామనుకున్నాడు. చిట్టచివరకు, "ప్రాణం పోయినా సరే ఆ తలుపు తెరిచి అక్కడేమున్నదో చూడవలిసిందే!" అని నిశ్చయించుకున్నాడు.

హసన్ ఒక దివ్వె తీసుకుని ఆ తలుపు దగ్గిరికి వెళ్ళి తాళంచెవి పెట్టి తిప్పాడు. నిశ్శబ్దంగా తలుపు దానంతట అదే తెరుచుకున్నది. హసన్ నిర్భయంగా లోపలికి అడుగుపెట్టాడు.




ఆ గదిలో ఒక కర్ర సామానుగాని, తివాసీగాని, చాపగాని, ఏమీలేదు. ఖాళీ గది. ఒక పక్కగా ఒక నిచ్చెన ఉన్నది. అది గది కప్పు దాటి పైకి వెళ్ళిపోయింది. హసన్ తన చేతిలోని దివ్వె కిందపెట్టి, నిచ్చెన మెట్లెక్కి కప్పులో కంతగుండా పైకి వెళ్ళిపోయాడు.

పై భాగం సమతలంగా ఉన్నది. అక్కడ అతనికొక చిన్నతోట కనిపించింది. అందులో మొక్కలూ, పూలపొదలూ ఉన్నాయి. అతను ఆ తోటలోకి అడుగు పెట్టేసరికి ఒక అత్యద్భుతమైన మనోహర దృశ్యం అతని కంట పడింది. అతని ముందు ఒక నిశ్చల




మైన సరస్సు అద్దంలాగా ఆకాశాన్ని ప్రతిబింబిస్తున్నది. సరస్సుకు అవతలి వైపున ఒక వింతైన భవనం ఉన్నది. దాని బురుజులు ఎంతో ఎత్తుగా ఆకాశంలోకి చొచ్చుకుపోయాయి. ఆ భవనానికీ సరస్సుకూ మధ్య చలవ రాళ్ళతోనూ, చుక్కల రాళ్ళతోనూ కట్టిన మెట్లున్నాయి. మెట్ల దిగువన, నీటిపైకి పొడుచుకు వచ్చేలాగా ఒక అరుగున్నది. దీనిని కెంపు, పుష్యరాగం, బంగారు, వెండి పలకలతో నిర్మించారు. ఈ అరుగు మీద నాలుగు గులాబీరంగు గల స్ఫటిక శిలలతో కట్టిన స్తంభాలూ, వాటిపైన పరిచిన పలచని ఆకుపచ్చరంగు బట్టా, దాని కింద చక్కని సింహాసనమూ ఉన్నాయి. వీటన్నిటినీ నిర్మించటంలో చూపిన పనితనం ఎంతేసి రాజులకూ సాధ్యపడేది కాదు.

హసన్ కొయ్యబొమ్మలాగా నిలబడి ఈ అద్భుతదృశ్యం చూసి ఆనందిస్తూండే సమయంలో పది పెద్ద పక్షులు ఎగురుతూ ఆకాశం నుంచి దిగివచ్చి సరస్సు ఒడ్డున వాలాయి. అవి కాస్సేపు ఒడ్డున అటూ ఇటూ తిరిగాక, వాటిలో పెద్దపక్షి సింహాసనం వద్దకు కదిలి వచ్చింది. మిగిలిన తొమ్మిది పక్షులూ దాన్ని అనుసరించాయి. హసన్ నిర్ఘాంతపోయి చూస్తూండగానే ఆ పక్షులన్నీ తమ తొడుగుల నుంచి స్త్రీల ఆకారాలతో బయటికి వచ్చాయి. ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క చంద్రబింబంలాగున్నది. అందరూ తమ పక్షి తొడుగులను వదిలేస్తూనే సరస్సులోకి దూకి ఓలలాడ నారంభించారు. వాళ్ళు ఒకరినొకరు తరుముకుంటూ గట్టిగా నవ్వసాగారు. వారి నవ్వులకు దిక్కులన్నీ ప్రతిధ్వనించాయి. వారందరినీ అందంలోనూ, చలాకీతనంలోనూ మించిన ఒక సుందరి హసన్‌ను ప్రబలంగా ఆకర్షించింది. అతను ఒక పొదచాటున నక్కి తనను ఆకర్షించిన సుందరిని తదేక దృష్టితో గమనించసాగాడు.



త్వరలోనే ఆ కన్యలు జలకాలు ముగించి, సన్నని వలిపెపు దుస్తులు ధరించి చాందినీ కింద విశ్రాంతి తీసుకున్నారు. ఇంతలో ఎవరో, "తెల్లవార వస్తోంది. ఇక మనం బయలుదేరి పోదామా?" అన్నారు.

వెంటనే అందరు తమతమ పక్షి తొడుగులు ధరించి, ఒక్కసారిగా ఆకాశంలోకి ఎగిరి పోయారు.

వాళ్ళు వెళ్ళినాక కూడా హసన్ శూన్యాకాశంలోకి చూస్తూ అలాగే చాలాసేపు నిలబడిపోయాడు. హసన్ అంతవరకు ఎన్నడూ ప్రేమ అనేది ఏమిటో ఎరగడు. తీరా ప్రేమ అంటే ఏమిటో తెలిసినాక అతనికి జీవితమంతా శూన్యమైపోయినట్టయింది. అతను ఆ రోజల్లా ఒక యుగంగా గడిపి రాత్రి కాగానే మళ్ళీ సరస్సు వద్దకు వచ్చాడు. కాని ఆ రాత్రి ఆ కన్యలు రాలేదు. మరుసటి రాత్రి కూడా వారు రాలేదు. హసన్ అన్నమూ, నీరూ, నిద్రా మానేసి, నిరాశలో పడిపోయి, "ఇలా బతికే కన్న చావు మేలు!" అనుకుంటూ ఆ రోజు కా రోజు శుష్కించిపోయి మంచం పట్టాడు.

పది రోజులు గడిచాక గంధర్వ రాజు కుమార్తెలు తండ్రి ఇంటి నుంచి తిరిగి వచ్చారు. వస్తూనే హసన్ అక్క అతన్ని



వెతుక్కుంటూ వచ్చి, అతని దుస్థితి చూసి కంటనీరు పెట్టుకుంటూ, "ఇదేమిటి, తమ్ముడూ? ఎందు కిలా అయిపోయావు? మొహమంతా పాలిపోయింది! కళ్ళు గుంటలు పడ్డాయి! నీ వ్యాధి ఏమిటో దాచకుండా చెప్పు!" అన్నది.

హసన్ కూడా కంట నీరు కారుస్తూ, "నేను చేసిన తప్పుకు శిక్ష అనుభవిస్తున్నాను. ఎవరూ కూడా నాకు సహాయం చెయ్యలేరు. నేనిలాగే ప్రాణాలు వదిలేస్తాను," అన్నాడు.

"అలా ఎన్నడూ అనుకోకు. నీ ప్రాణానికి మా అందరి ప్రాణాలు అడ్డేస్తాము. నీవు






చావటమే జరిగితే నేనూ చనిపోతాను,'' అన్నది అతని అక్క.

''నేను ఆహారం ముట్టి పది రోజు లయింది,'' అంటూ హసన్ జరిగినదంతా తన అక్కకు చెప్పేశాడు.

ఆమె వద్దన్న పని చేసినందుకు చివాట్లు తగులుతాయని హసన్ అనుకున్నాడు. అయితే అతని అక్క అతన్ని పల్లెత్తు మాట కూడా అనకపోగా అతని స్థితికి జాలి పడి, ''నువు అధైర్య పడకు. నీవు ప్రేమించిన కన్య. నీకు దక్కేటట్టు నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను. అయితే నీ రహస్యం నా మిగిలిన అక్కలకు ఏమాత్రమూ తెలియ నివ్వకు. తెరవరాని తలుపు మాట వస్తే అది ఎక్కడ ఉన్నదీ కూడా నీకు తెలియదని చెప్పు. ఎందుకిలా కృశించి పోయావని అక్కలు ప్రశ్నిస్తే, 'మీ కోసం బెంగపడి ఇలా అయాను,' అని జవాబు చెప్పు,'' అని సలహా ఇచ్చింది.

తరవాత ఆమె తన అక్కలతో, ''పాపం, హసన్ ఒంటరిగా ఉండి, మన కోసం బెంగ పడి మంచాన పడ్డాడు. అతనికి తన తల్లీ, ఊరూ జ్ఞాపకం వచ్చి భరించరాని వేదన కలిగిందట!'' అన్నది.

ఇది విని రాజకుమార్తెలు ఎంతో నొచ్చు కుని అతని వద్దకు వచ్చి ఎన్నో రకాల ఉపచారాలు చేశారు; అతని చేత ఆహారం తినిపించారు; తమ తండ్రి దేశంలో చూసిన వింతలన్నీ అతనికి చెప్పారు.

ఈ విధంగా ఒక నెల రోజులపాటు వారు అతనికి ఉపచారాలు చేయగా హసన్ కొంతవరకు కోలుకున్నాడు.

తరవాత ఒకనాడు రాజకుమార్తెలందరూ వేటకు బయలుదేరారు. కడగొట్టు రాజ కుమార్తె హసన్‌కు తోడుగా ఉంటానని ఉండిపోయింది. మిగిలిన వాళ్ళు వెళ్ళగానే ఆమె హసన్‌ను సరస్సు సమీపంలో ఉన్న ఉద్యానవనంలోకి తీసుకుపోయి, ''చూడు,

హసన్! ఈ సరుస్సు పక్కన అనేక స్నాన ఘట్టాలున్నాయి. నీకు కనిపించిన కన్యలు ఎక్కడ స్నానం చేశారు?" అని అడిగింది. హసన్ ఆమెకు సింహాసనం ఉన్న చోటు చూపించాడు.

ఆమె వెలవెలబోతూ, "అరి భగవంతుడా! నువు చూసిన కన్యలు గంధర్వ చక్రవర్తి కూతుళ్ళు, ఆమె చెలికత్తెలూ. ఆ చక్రవర్తి కింద మా నాన్న ఒక చిన్న సామంతు మాత్రమే. నీవు ప్రేమించినది చక్రవర్తి ఆఖరు కుమార్తె అయి ఉంటుంది. గంధర్వ చక్రవర్తి ఉండే లోకానికి మానవులే కాదు, ఇతర గంధర్వులుకూడా వెళ్ళలేరు. నీవు చూసిన గంధర్వ చక్రవర్తి కూతురు ప్రతి అమావాస్యకూ తన చెలికత్తెలతో సహా ఇక్కడికి ఎగిరి వచ్చి జలకాలాడి పక్షి తొడుగుల సహాయంతో తమ లోకానికి తిరిగి పోతుంది. ఆ తొడుగును చేజిక్కించుకుంటే తప్ప ఆమె నీకు దొరికే మార్గం లేదు. అందుచేత ఆమె ఇంకొకసారి వచ్చేదాకా ఇక్కడ పొంచి ఉండి, ఆమె సరస్సులో జలకాలాడే సమయంలో ఆమె తొడుగును దొంగిలించు. ఆమె దానిని ఇవ్వమని ఎంత దీనంగా బతిమాలినా నువు చలించకు. చలించిపోయి ఆమె కా తొడుగు ఇచ్చేశావో




నువ్వూ, నీతోబాటు మేమూ, మాతోబాటు మా నాన్నా, అందరమూ సర్వనాశనం కావటం నిశ్చయం. నువు గుండె రాయి చేసుకుని ఆమెను జుట్టు పట్టుకుని జరజరా ఈడ్చుకు వచ్చెయ్యటం ఉత్తమమైన పని. అలా చేస్తే ఆమె నీకు లొంగి వస్తుంది. ఆ తరవాత ఏమవుతుందో చూద్దాం," అని సలహా యిచ్చింది.

హసన్ ఈ మాటలు విని ఆనందంతో తన్మయుడైపోయాడు. అతనికి బలమూ, ఉత్సాహమూ తిరిగివచ్చేశాయి. అతను అక్క వెంట భవనంలోకి తిరిగివెళ్ళి పోయాడు. ఆ రోజంతా అతను రాజ

కుమార్తెలతో కులాసాగా కబుర్లు చెప్పుతూ ఆనందంగా గడిపేశాడు.

మర్నాడు అమావాస్య. చీకటి పడగానే హసన్ సరస్సు వద్దకు వెళ్ళి మెట్ల సమీపంలో దాక్కున్నాడు. కొంచెం సేపయాక చక్రవర్తి కుమార్తె, ఆమె చెలికత్తెలూ ఎగురుతూ వచ్చి వాలి, తమ పక్షి ఉడుపులు తీసేసి నీటిలోకి దిగారు. హసన్ దడదడలాడే గుండెతో ఆ ఉడుపులను సమీపించి, తన ప్రియురాలి ఉడుపు సంగ్రహించి, మళ్ళీ వెళ్ళి దాక్కున్నాడు.

కొంత సేపయాక చక్రవర్తి కూతురు నీటి నుంచి పైకివచ్చి, తన ఉడుపు మాయంకావటం గమనించి, గట్టిగా కేకలు పెట్టసాగింది. ఆమె చెలికత్తెలు ఈ కేకలు విని నీటి నుంచి పైకివచ్చి జరిగిన సంగతి తెలుసుకున్నారు. తెలుసుకున్నవాళ్ళు తమ యజమానురాలిని ఆపదలో ఆదుకోవటానికి బదులు, బెదిరిపోయినవాళ్ళలాగా, ఎవరి ఉడుపులు వారు ఆదరాబాదరా తొడుక్కుని, రివ్వున ఆకాశంలోకి ఎగిరిపోయారు.

తన ఉడుపు పోగొట్టుకుని, చెలికత్తెల చేత విసర్జించబడి, అవమానం పాలైన చక్రవర్తి కూతుర్ని హసన్ సమీపించాడు. ఆమెను చూసి అతని గుండె ద్రవించింది. కాని అతన్ని చూడగానే ఆమె సరస్సు గట్టున పడి పరిగెత్తసాగింది. అతను ఆమెను వెంబడించాడు. చివరి కతను ఆమెను అందుకుని, ఆమె జుట్టు తన చేతిలో మెలివేసి పట్టుకుని తన వెంట నడిపించాడు. ఆమె కళ్ళు మూసుకుని, ఏ మాత్రమూ పెనుగులాడక అతను నడవమన్నట్టు నడిచింది. హసన్ ఆమె కన్నీటిని గాని, ఆక్రందనాన్ని గాని పాటించకుండా, గుండె రాయి చేసుకుని, ఆమెను తన గదికి తెచ్చి, లోపల ఉంచి తలుపు బీగంవేసి, ఈ సమాచారం తన అక్కతో చెప్పాడు.

—(ఇంకా ఉంది)



# వివేకానందుడి బాల్యం

కలకత్తాలో విశ్వనాథదత్తా అనే ప్లీడరుండే వాడు. 1863 జనవరి 12 న ఆయన భార్య అయిన భువనేశ్వరీదేవి ఒక మగపిల్లవాణ్ణి కన్నది. నరేంద్రనాథుడని పేరు పెట్టు కున్నారు. కుర్రవాడు చురుకైనవాడు, భలే అల్లరి చేసేవాడు. ఇద్దరు దాదు లుండికూడా కుర్రవాణ్ణి పట్టలేక పోయేవారు. మంకుపట్టు పట్టాడంటే లంచాలకూ, బెదిరింపులకూ, దేనికీ లొంగేవాడు కాడు. కాని తల్లి తన చెవిలో శివుడి నామం పలికితే వెంటనే శాంతించేవాడు.

అతను దృఢకాయుడు. వ్యాయామ క్రీడలూ, కుస్తీలూ, కర్రసామూ చేసేవాడు. ఫుట్‌బాల్ చాలా బాగా ఆడేవాడు. వీటి మూలంగా మంచి బలశాలిగా తయారయాడు.



అతనికి పేదవాళ్ళపై ఎంతో దయ. చేతికి అందినదెల్లా వారికిచ్చేసే వాడు. ఇలా చేస్తున్నందుకు ఒకనాడు తల్లి అతన్ని గదిలో పెట్టి ద్వారం బంధించిందట. ఆ సమయంలో ఒక బిచ్చగాడు ఇంటి ముందుకు వచ్చాడట. గదిలో ఇంకేమీ దొరకనందున కుర్రవాడు తన తల్లి చీరెను కిటికీ గుండా వాడి కోసం విసిరి వేశాడట. పేదలపట్లా, అనాథల పట్లా అతనికి యావజ్జీవమూ ఇలాటి ప్రేమే ఉండేది.

నరేంద్రుడు చదువులోనూ గట్టివాడే. అన్నింటిలోనూ ఫస్టు మార్కు తెచ్చుకునే వాడు. ఒక రోజు క్లాసులో మేస్టరు పాఠం చెబుతూంటే కుర్రాళ్లంతా అల్లరి చేస్తున్నారు. మేస్టరు వాళ్ళను తాను చెబుతున్న పాఠం గురించి ప్రశ్నించాడు. నరేంద్రుడొక్కడే ప్రశ్నలకు సమాధానాలు చెప్పగలిగాడు.

ఒకనాడు అతనూ అతని మిత్రులూ పొరుగింటివాళ్ల చెట్టెక్కి ఆడుకోబోతూండగా ఆ ఇంటి వృద్ధుడు, వాళ్ళు చెట్టు మీది నించి పడి కాళ్ళూ చేతులూ విరుచుకుంటారేమోననే భయంతో, ఆ చెట్టు మీద దయ్యం ఉన్నదనీ, చెట్టెక్కిన వాళ్ళ మెడలు విరిచేస్తుందనీ అన్నాడు. మిగిలినవాళ్ళంతా బెదిరి దూరంగా వెళ్లారు. కాని నరేంద్రుడు చెట్టెక్కి తన స్నేహితులతో, "ఎంత బుద్ధి తక్కువవాళ్లు! తాత చెప్పింది అబద్ధం! దయ్యం నా మెడ విరవలేదే!" అన్నాడు.

నరేంద్రుడు చిన్నతనం నుంచి భగవంతుడి యందు నమ్మకం గలవాడు, శ్రీ రామకృష్ణ పరమహంసకు శిష్యత్వం చేసి తన కోరిక సిద్ధింపజేసుకున్నాడు.

ఆ నరేంద్రనాథ దత్తాయే వివేకానందుడు. ఆయన శత వార్షిక జయంతి ఈ యేడు మహా వైభవంగా జరుగుతున్నది.



# నిజంలాంటి కల

పొరుగూళ్ళో జమీందారుగారి బంధువుల యింటి ఒక అమ్మాయి మరణించింది. పరామర్శించటానికి జమీందారుగారి ఇంటిల్లి పాతీ, భీమన్నతో సహా, బయలుదేరి వెళ్ళారు. శవం చుట్టూ చేరి అందరూ గొల్లున ఏడుస్తూంటే భీమన్నకు కూడా ఏడు పొచ్చింది. ఇటువంటి సన్నివేశాలు అత నెన్నడూ ఎరగడు. శవానికి స్నానం చేయించటమూ, అలంకరించటమూ, బ్రాహ్మణులు మంత్రాలు చదవటమూ, శవాన్ని శ్మశానానికి తీసుకుపోయి దహనం చేయటమూ, భర్త తన చేతి మీదుగానే, చనిపోయిన భార్యను ఇంత బూడిద చెయ్యటమూ—ఇదంతా భీమన్న తలలో బాగా నాటుకుపోయింది.

ధహనసంస్కారాలయాక కూడా భీమన్నకు ఆ సంగతులే తలలో మెదిలాయి; ఆ దృశ్యాలే కళ్ళ ఎదట కదిలాయి. ఆ రాత్రి అతనికి కలలో కూడా ఆ సంఘటనలే వచ్చాయి. కాని వ్యక్తులు మారారు. తన భార్య మహలక్ష్మి చనిపోయిందిట. అందరూ ఏడిచారుట. మహలక్ష్మికి స్నానం చేయించి, అలంకరించి, శ్మశానానికి తీసుకుపోయారుట. తాను నిప్పు పట్టుకుని మహలక్ష్మి శవం వెంట నడిచాడట. శ్మశానంలో చితిపేర్చి మహలక్ష్మిని దానిపైన పడుకోబెట్టారట. చితికి తానే నిప్పు పెట్టాడట. క్షణంలో మహలక్ష్మి బూడిద అయిపోయిందట. నిద్రలోనే భీమన్న పెద్ద పెట్టున ఏడవసాగాడు.

పక్కనే పడుకుని నిద్రపోతున్న మహలక్ష్మి లేచి, అతన్ని తట్టి లేపి, "ఎందుకలా మూలుగుతున్నారు?" అని అడిగింది.

భీమన్న తన భార్య గొంతు విని ఉలిక్కిపడి లేచి, మహలక్ష్మిని చూసి కంగారుపడుతూ, "నువ్వు చనిపోయావు. నేను

నిన్ను దహనం చేశాను. నువు దయ్యా నివి!" అన్నాడు.

మహలక్ష్మి నవ్వి, "మీ కేదో పీడ కల వచ్చి ఉంటుంది. నేను చావలేదు. ఇదుగో, బతికే ఉన్నాను," అన్నది.

భీమన్నకు వచ్చిన కల ఎంత స్ఫుటంగా ఉన్నదంటే అది అతని ప్రాణానికి నిజం గానే తోచింది. అందుచేత అతను తన భార్య మాటలు నమ్మలేక, "కాదు, నువు దయ్యానివే!" అంటూ గది మూలవెళ్ళి కూచుని కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. అతని అపోహ ఎలా తొలగించాలో మహ లక్ష్మికి అర్థం కాలేదు.

తెలతెలవారుతూండగానే భీమన్న లేచి తన బట్టలు సర్దుకో నారంభించాడు.

"ఎక్కడికి ప్రయాణం?" అని మహ లక్ష్మి అడిగింది.

"నే నిక్కడ ఉండను. మా బామ్మ యింటికి వెళ్ళిపోతాను," అన్నాడు భీమన్న.

"సరే, వెళ్ళి మీ బామ్మ ఎలాగున్నారో చూసి రండి. అక్కడికి వెళుతున్న సంగతి ఎవరికీ చెప్పకండి," అన్నది మహలక్ష్మి.

భీమన్న ఎవరితోనూ ఏమీ చెప్పకుం డానే బామ్మ యింటికి బయలుదేరాడు. అతనికి ఎన్నడూ కలలు రాని కారణంచేత ఈ కల అతనికి వాస్తవంగానే ఉన్నది.



మర్నాడు జమీందారు గారింటో వాళ్ళు, అల్లుడుగా రెక్కడ అని ప్రశ్నించుకుంటూంటే మహలక్ష్మి, "ఆయనకు రాత్రి ఏదో పాడు కల వచ్చిందిట. ఒక్కసారి వాళ్ళ బామ్మను చూసి వస్తానని తెల్లారక ముందే బయలుదేరి వెళ్ళారు," అన్నది.

బామ్మ ఉండే ఊరుకు రెండు రోజుల ప్రయాణం. అందుచేత పగలల్లా నడిచి భీమన్న ఒక సత్రంలో పడుకున్నాడు. ఆ రాత్రి అతనికి మళ్ళీ కల వచ్చింది. బామ్మ చచ్చిపోయినట్టూ, అందరూ. ఆమె చుట్టూ చేరి ఏడ్చినట్టూ, తానే బామ్మకు తలకొరివి పెట్టినట్టూ భీమన్న కలగన్నాడు. ఆ కలలోనే అతను పెద్దపెట్టున ఏడుస్తూ, "నా భార్య పోయింది. బామ్మా పోయింది. ఇంక నేను బతికి ఎందుకు?" అంటూ బామ్మ బూడిదలో పొర్లిగింతలు పెట్టాడు.

ఇంతలో భీమన్నకు మెలకువ వచ్చింది. అతను నిర్ఘాంతపోయి చుట్టూ కలయజూశాడు. తాను శ్మశానంలో లేడు, సత్రంలో ఉన్నాడు. తన బట్టలకు బూడిద ఏమాత్రమూ అంటలేదు. తాను చూసిందంతా భ్రమ అయి ఉంటుందా అని భీమన్నకు అనుమానం తగిలింది. ఆ అనుమానంతోటే బామ్మ ఇల్లు చేరుకున్నాడు. బామ్మ బతికే ఉన్నది—చచ్చిపోలేదు. ఆమె భీమన్నను కుశల ప్రశ్నలు వేసి, వాడి రాకకు కారణం అడిగింది. భీమన్న దాచకుండా అంతా చెప్పేశాడు.

అంతా విని బామ్మ, "వెర్రి సన్యాసీ! నీ పెళ్ళాం చెప్పినదే నిజం—అదంతా కల. కలను నిజమనుకున్నావు. నీకు కల అంటే ఏమిటో కూడా తెలీదు. అందుకే మహలక్ష్మి చెప్పినట్టు వింటూ ఉండు," అని హితబోధ చేసింది.

ఒక పూట బామ్మ చేతి వంట తిని భీమన్న అత్తవారింటికి తిరిగి వచ్చేశాడు.

[పై సంచికలో మరొక సంఘటన]







# యుక్తి వేరు - శక్తి వేరు

పెద్దబ్బాయికి పరీక్షలు దగ్గిరికొస్తున్నాయి. కాని వాడు శ్రద్ధగా చదవటం లేదు. ఈ సంగతి తెలిసి తాతయ్య, "ఏమిరా, పరీక్షలు గామాలు. చదవకుండా గాడిదెలు కాస్తున్నావేం ?" అని అడిగాడు పెద్దవాణ్ణి.

"పుస్తకాలన్నీ చదవటం దండగలే, తాతయ్యా. ముఖ్యమైన పాఠాలు చదివి ఉంచుకున్నాను. కిందటేడు కూడా అలాగే ప్యాసయ్యాను," అన్నాడు పెద్దవాడు.

"నీ సంగతి చూస్తే కూతలు నేర్చిన వేటగాడి వతుగా ఉందేమిరా! గట్టి దెబ్బ తింటావు సుమా! యుక్తి అనేది గత్యంతరం లేని పరిస్థితిలో కాపాడుతుందేగాని అది శక్తి ఎన్నటికీ కాదురా!" అన్నాడు తాతయ్య.

"వేటగాడు" అనే మాట వినిపించగానే పిల్లలందరూ పరిగెత్తుకొచ్చి, "కూతలేమిటి, తాతయ్యా ?... వేటగా డెవరు, తాతయ్యా ? కథ చెప్పు, తాతయ్యా!" అని తలో మాటా అన్నారు. తాతయ్య పొడుంకాయ తీసి చిటికెడు పొడుం పీల్చి ఇలా ప్రారంభించాడు:

వెనకటి కొక వేటగా డుండేవాడు. వాడికి వేటాడటంలో ఏమంత నేర్పు లేకపోయినా, అడవి మృగాల అరుపులన్నీ అరవటంలో చాలా నేర్పుండేది. ఈ నేర్పుతో వాడేం చేసేవాడూ, లేళ్ళు తిరిగే ప్రాంతానికి వెళ్ళి లేడిలాగా అరిచేవాడు. అది నిజంగా లేడి అరుపే అనుకుని మిగిలిన లేళ్ళు వాడు దాక్కున్న చోటికి వచ్చేవి. వాటిని దగ్గిరదాకా రానిచ్చి బాణంతో ఒకటి రెండు లేళ్ళను కొట్టి పట్టుకెళ్ళేవాడు.

వేటాడటం మాట అటుంచి వాడు తన ప్రాణం కాపాడుకునేటందుకు కూడా ఇదే యుక్తి ఉపయోగించేవాడు. అడవిలోకి వెళ్ళినాక అన్నీ అనుకూలంగా అమరుతాయా? ఒక్కొసారి వాడి లేడి కూతలు విని ఏ తోడేళ్ళో పరిగెత్తుకుంటూ వచ్చేవి.

తోడేళ్ళు వాణ్ణి వాసన పట్టాయంటే చీల్చి చంపేస్తాయి. అలాటప్పుడు వాడేం చేసే వాడూ, పులిలాగా గాండ్రించే వాడు. వెంటనే తోడేళ్ళు భయపడి పారిపోయేవి. ఒక్కొ సారి ఏ పులో వాడున్నవేపు వచ్చేదనుకో, దాన్ని భయపెట్టటానికి ఎలుగుబంటిలాగా గుర్, గుర్ అని చప్పుడు చేసేవాడు. ఆ చప్పుడు వినగానే పులి పారిపోయేది. యుక్తికీ శక్తికీ తేడా తెలీని ఆ అప్రయోజకుడు తనంత గొప్ప వేటగాడు ప్రపంచంలో లేడనుకుంటూండేవాడు.

కాని ఒక రోజేమయిందో తెలుసా? వాడు అడవిలో ఒక పొదలో దాక్కొని, లేడిలాగా ధ్వని చేసేసరికి, తోడేలు వచ్చింది.

తోడేలు భయంకరంగా వస్తూండటం చూసి వేటగాడు భయపడి పులిలాగా గాండ్రించాడు. పొదలో నిజంగా పులే ఉంది కాబోలనుకుని తోడేలు పారిపోయింది. అయితే ఆ పులి అరుపు విని మరొక పులి వాడి కేసి వచ్చింది. "చచ్చానురా, బాబూ!" అనుకుని వేటగాడు పులిని భయపెట్టటానికి ఎలుగుబంటిలాగా అరిచాడు. ఆ అరుపు విని పులి వెనక్కు తిరిగిపోయింది. కాని మరో పక్కనుంచి రెండు ఎలుగుబంట్లు వచ్చాయి. వాటిని భయపెట్టటానికి ఎలా అరవాలో వేటగాడికి తెలియలేదు. అందు చేత వాడు పొదలోనుంచి పారిపోవటానికి ప్రయత్నించాడు. ఎలుగుబంట్లు వాణ్ణి వదుల్తాయా? పట్టుకుని చీల్చి చెండాడేశాయి. వాడే నిజమైన వేటగాడైతే లేడి వచ్చేది, తోడేలు వచ్చేది, పులి వచ్చేది, ఎలుగుబంటి వచ్చేది, ధైర్యంగా ఎదిరించి చంపేస్తాడు గాని వాటినుంచి తప్పించుకోవటానికి యుక్తులు పన్నుతాడా?

తాతయ్య ఈ కథ చెప్పి పెద్దబ్బాయితో, "కనక, పెద్దవాడా, కిందటేడు యుక్తితో పాసయితే అయావేమో, ఇకముందునుంచి శక్తితో పాసుకావటం నేర్చుకో," అన్నాడు.






చెట్లూ, పొదలూ నరికి కీకారణ్యం మధ్యగా దారి చేసుకుంటూ రామలక్ష్మణులు జనస్థానం దాటి మూడుకోసుల దూరం వెళ్ళి క్రౌంచారణ్యం ప్రవేశించారు. వారు దారిలో మధ్యమధ్య విశ్రాంతి తీసుకుంటూ, దారి పొడుగునా సీతను వెతుకుతూ క్రౌంచారణ్యం దాటి మతంగాశ్రమ ప్రాంతం చేరి అక్కడ ఒక పెద్ద గుహను చూశారు. అది చీకటి గుహ.

రామలక్ష్మణులు ఆ గుహ దగ్గిరికి వెళ్ళే సరికి అందులో వారికి ఒక వికారమైన పెద్దరాక్షసి కనిపించింది. దాన్ని చూస్తేనే మామూలు మనుషులు దడుచుకుంటారు, అసహ్యపడతారు. పెద్ద నోరూ, పెద్ద కళ్ళూ, పెద్ద పొట్టా, కోరలూ, గరుకైన చర్మమూ గల ఆ రాక్షసి సింహాలనూ, పులులనూ పీక్కు తింటూ రామలక్ష్మణులను చూసింది. వెంటనే అది, పరిగెత్తుకుని, ముందు నడిచే లక్ష్మణుడి వద్దకు వచ్చి, అతన్ని మోహించి పట్టుకున్నది.

అది లక్ష్మణుడితో, "నా పేరు అయోముఖి. ఇంతకాలానికి నాకు నచ్చినవాడవు దొరికావు. మనిద్దరమూ పెళ్ళాడి అరణ్యమంతా విహరించుదాం, నాతో రా!" అన్నది. లక్ష్మణుడికి ఆగ్రహం వచ్చి కత్తి దూసి దాని ముక్కూ, చెవులూ నరికేశాడు. అసలే వికారంగా ఉన్న ఆ రాక్షసి మరింత భయంకరంగా అయి, పెడబొబ్బలు

పెడుతూ అరణ్యంలోకి పారిపోయింది. తరవాత వారిద్దరూ సీత కోసం ఆ వన మంతా వెదక నారంభించారు. ఇంతలో ఉన్నట్టుండి ఒక భయంకరమైన ధ్వని పుట్టి ఆకాశానా, దిక్కులా మారుమోగింది. రామలక్ష్మణులా ధ్వని వచ్చిన దిక్కుగా వెళ్ళి గుబురుగావున్న ఒక పొదలో ఒక వింత ఆకారాన్ని చూశారు.

ఆ ఆకారం చిన్నకొండ ప్రమాణంలో ఉన్నది. నల్లగా ఉన్నది. దానికి తలా, మెడా, కాళ్ళూ లేవు. వక్షస్థలంలో ఒక పెద్ద కన్ను కాంతివంతంగా ప్రకాశిస్తున్నది. దాని కొక పెద్దరెప్ప కూడా ఉన్నది. దానికి కిందుగా పొట్టలో పెద్ద నోరున్నది. మొండెం లాగున్న ఈ ఆకారానికి అతిదీర్ఘమైన చేతులు మాత్రం ఉన్నాయి.

ఈ వింత అవతారం కబంధుడనే రాక్షసుడు. అలా ఒకే చోట కదలకుండా ఉండి, అతి దీర్ఘమైన చేతులు చాచి, ఎంతో దూరాన ఉన్న జంతువులనూ, మనుషులనూ కూడా పట్టి భక్షిస్తూ ఉంటాడు.

రామలక్ష్మణులు తన ఎదటికి రాగానే కబంధుడు ఇద్దరినీ చెరొక చేత్తోనూ బలంగా పట్టేసి, తన కేసి లాక్కోసాగాడు. ఎంతో బలమూ, ఆయుధాలూ ఉండి కూడా ఆ అన్నదమ్ములు వాడి చేతిపట్టు వదిలిం



ఛుకోలేక పోయారు. లక్ష్మణుడు భయపడి పోయి, "అన్నా, నన్ను వీడికి బలి ఇచ్చి నీ ప్రాణాలు కాపాడుకుని, వెళ్ళి సీతను వెతుకు!" అన్నాడు.

రాముడు లక్ష్మణుడికి భయపడ వద్దని ధైర్యం చెప్పాడు.

ఇంతలో కబంధుడు భయంకరమైన గొంతుతో, "ఇద్దరూ బలిసిన అబోతుల్లాగున్నారు. మిమ్మల్ని విడవను. నా నోటికి చిక్కారు," అన్నాడు.

ఆ మాటలు వినగానే రాముడికి భయంతో నోరెండుకు పోయింది. క్షణం క్రితం లక్ష్మణుడికి ధైర్యం చెప్పినవాడు కాస్తా నీరు కారి పోయి, "మన రోజులు బాగాలేవు. అన్నీ కష్టాలే. మన కిలాంటి ఘోర మరణం రాసిపెట్టి ఉన్నదికాబోలు. కాలం తీరితే ఎంతెంత మహావీరులు కూడా యుద్ధంలో చావటం లేదా?" అన్నాడు.

అంతలో లక్ష్మణుడికి పరాక్రమం వచ్చేసింది. అతను రాముడితో, "వీడు మనని తినటానికి సిద్ధంగా ఉన్నాడు. వీడి బలమంతా చేతుల్లోనే ఉంది. వీడి చేతులు రెండూ నరికెద్దాం!" అన్నాడు.

కబంధు డీ మాటలు విని మండిపడి నోరు తెరిచి ఇద్దరినీ మింగబోయాడు. సరిగా ఆ క్షణంలోనే రాముడు వాడి కుడిచేతినీ,





లక్ష్మణుడు వాడి ఎడమచేతినీ నరికేశారు. ఆ దెబ్బతో కబంధుడు పెడబొబ్బలు పెడుతూ పడిపోయాడు.

వాడు రామలక్ష్మణులను, "మీ రెవరు?" అని అడిగాడు. లక్ష్మణుడు వాడికి తమ సంగతి చెప్పి, "ఈ వింత ఆకారం గల నీ వెవడవు? ఈ వనంలో ఎందుకున్నావు?" అని అడిగాడు.

"మీ రిద్దరూ రామలక్ష్మణులా? మీరు ఈ అరణ్యానికి రావటం నాకు చాలా మంచి దయింది. నా కథ చెబుతాను వినండి," అంటూ కబంధుడు తన వృత్తాంతం వారికి యిలా చెప్పాడు:

ఒకప్పుడు ఈ కబంధుడు ఇంద్రుడికి తీసిపోని దేవరూపం గలవాడు. అయితే అతను భయంకరమైన ఈ రూపం ధరించి వనాలలో ఉండే మునులను భయపెట్టుతూ వచ్చాడు. ఇలా చేస్తూండగా ఒకసారి స్థూలశిరుడనే మహాముని తటస్థపడి, "నీకీ రూపమే శాశ్వతంగా ఉండిపోవు గాక!" అని శపించాడు. అప్పు డీ కబంధుడు మునికి క్షమాపణ చెప్పుకుని శాప విముక్తి ఎలాగని అడిగాడు. "ఎప్పుడు రాముడు అడవికి వచ్చి, నీ చేతులు నరికి నీకు దహనక్రియలు చేస్తాడో అప్పుడు నీకు యథారూపం వస్తుంది," అని ముని చెప్పి వెళ్ళిపోయాడు. స్థూలశిరు డిచ్చిన ఈ శాపం అతి విచిత్రంగా ఫలించింది. శాపం తగలక మునుపే కబంధుడు బ్రహ్మను గురించి అతి దారుణమైన తపస్సు చేశాడు. బ్రహ్మ అతడి తపస్సు మెచ్చుకుని అతనికి దీర్ఘాయువు వరంగా ఇచ్చాడు. "బ్రహ్మదేవుడు నాకు దీర్ఘాయు విచ్చాడు గనక నన్నిక దేవేంద్రుడు కూడా ఏమీ చేయలేడు," అని గర్వించి, అతను ఇంద్రుణ్ణి యుద్ధానికి పిలిచాడు. ఇంద్రుడు వజ్రాయుధంతో అతని తలనూ, కాళ్ళనూ శరీరంలోకి తోసేసి మొండెంలాగా తయారుచేశాడు.

ఆ రూపంతో ఎలా బతకటం? అందు చేత అతను ఇంద్రుణ్ణి ఎంతగానో వేడుకుని తన ప్రాణాలు తీసెయ్యమన్నాడు. "బ్రహ్మ దేవుడు నీకు దీర్ఘాయు విచ్చి ఉండగా నేను నీ ప్రాణాలెలా తియ్యను? నేనా పని చెయ్యను," అన్నాడు ఇంద్రుడు.

"తిండి తినటానికి నోరుకూడా లేకుండా నేను దీర్ఘకాలం ఎలా జీవిస్తాను?" అని కబంధుడు అడిగాడు.

అప్పు డింద్రుడు అతనికి అతి దీర్ఘమైన చేతులూ, కడుపులో పదునైన కోరలు గల నోరూ ఏర్పాటు చేశాడు. అతడికి కబంధ రూపం ఏర్పడింది. ముని శాపం ఫలించింది. ఆ తరవాత కబంధుడు అక్కడే ఉండిపోయి అందిన ప్రతి ప్రాణినీ తింటూ వచ్చాడు. కబంధు డీ కథంతా చెప్పినాక రాముడు, "నా భార్య అయిన సీతను రావణు డనేవాడు ఎత్తుకుపోయాడు. అతని పేరు తెలుసే తప్ప, ఎక్కడ ఉంటాడో, ఎవడో, అతని శక్తి ఎటువంటిదో మాకు తెలియదు. అష్ట కష్టాలూ పడి సీతను వెతుకుతున్న మాకు నీబోటివాడు సహాయం చెయ్యటం భావ్యం," అన్నాడు.

దానికి కబంధుడు, "నా కిప్పుడు దివ్య జ్ఞానం ఏమీలేదు. నన్ను మీరు దహించి నట్టయితే నిజరూపం పొంది మీకు చేతనైన





సహాయం చేస్తాను, సలహా ఇవ్వగలుగుతాను," అన్నాడు.

రామలక్ష్మణులు ఒక పల్లపు ప్రదేశంలో చితి పేర్చి దానిపైన కబంధుణ్ణి పెట్టి దహనం చేశారు. కొద్దిసేపట్లో ఆ చితిని తోసుకుని ఒక దివ్యపురుషుడు స్వచ్ఛమైన బట్టలు కట్టుకుని, అనేక దివ్యాభరణాలతో పైకి వచ్చాడు. అతను హంసలతో అలంకరించబడిన విమానంలో కూచుని ఆకాశంలోకి లేచి, రాముడితో ఇలా అన్నాడు.

"రామా, సీతను తిరిగి సంపాదించుకోవటానికిగాను నీకు ఒక వ్యక్తి సహాయం చెయ్యగలడు. అతడు కూడా నీలాగే రాజ్యాన్నీ, భార్యనూ పోగొట్టుకుని, అన్న భయం చేత పంపాసరోవర సమీపాన ఋశ్యమూకపర్వతం మీద నలుగురు అనుచరులతో ఉంటున్నాడు. అతను సుగ్రీవుడనే పేరు గల వానరరాజు, వాలి అనేవాడి తమ్ముడు, సత్యసంధుడు, సమర్థుడు, పరాక్రమశాలి. సీతను వెదకటానికి అతను సహాయపడగలడు. నీవు ముందుగా అతని వద్దకు వెళ్ళి అగ్నిసాక్షిగా అతనితో స్నేహం చేసుకో. అతను కోరిన సహాయం చెయ్యి, అతని నుంచి సహాయం పొందు. అతని భటులైన వానరులు సీత ఎక్కడ వున్నదీ తప్పక తెలుసుకోగలరు."

కబంధు డీ మాటలు చెప్పి, ఋశ్యమూకానికి వెళ్ళే మార్గం వివరించి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

సుగ్రీవుణ్ణి కలుసుకోవటం లక్ష్యంగా పెట్టుకుని రామలక్ష్మణులు పంపాసరోవరం కేసి బయలుదేరారు. వారు మర్నాటికి పంపాసరస్సు యొక్క పడమటి గట్టు చేరుకుని, అక్కడ చెట్ల మధ్య అందమైన శబరి ఆశ్రమం చూశారు.

ఈ ఆశ్రమంలో మతంగమహాముని ఉండేవాడు. ఆయన వద్ద తపశ్శక్తిసంపన్నులైన శిష్యులుండేవారు. శబరి అనే సన్యా

సిని ఆ శిష్యులకు సేవచేస్తూ తాను కూడా తపస్సు చేసింది. రాముడు చిత్రకూటానికి వచ్చిన సమయంలో ఆ మతంగ శిష్యులు ఐహికజీవితం చాలించి స్వర్గానికిపోతూ శబరితో, "రాముడు నీ ఆశ్రమానికి రాగలడు. అతనికి చక్కగా అతిథి సత్కారాలు చేసి పుణ్యలోకాలు పొందు," అని చెప్పారు. వారు వెళ్ళినాక వృద్ధురాలైన శబరి రాముడి రాకకు ఎదురుచూస్తూ, వన్యాహారాలూ, ఫలాలూ అతని కోసం దాచి ఉంచింది.

శబరి రామలక్ష్మణులకు వందనం చేసి ఈ సంగతి తెలిపింది. రాముడి కోరికపై ఆమె రాముడికి తపోవనమంతా చూపింది. అక్కడ మునులు తమ తపశ్శక్తి చేత సప్త సముద్రాలూ సృష్టించుకున్నారు. వారి యాగవేదిక చెక్కుచెదరకుండా ఉన్నది. ఏనాడో ఆ మునులు కట్టిన పుష్పమాలలు వాడకుండా నిలిచి ఉండటం రాముడు చూశాడు. ఇలా అక్కడి వింతలన్నీ చూపించి శబరి రాముడితో, "ఇంక నేను దేహం చాలించి నా యజమానులైన మహా మునులను చేరుకుంటాను," అన్నది. తరవాత ఆమె అగ్నిప్రవేశం చేసి ఊర్ధ్వలోకాలకు వెళ్ళిపోయింది.

రాముడు ఆ వనం చూసి, అక్కడి సప్తసముద్రాలలో స్నానం చేసి, తర్పణాలు విడిచిన మీదట అతనికి మనశ్శాంతి కలిగింది, భవిష్యత్తు గురించి ఆశ పుట్టుకొచ్చింది. అతను లక్ష్మణుడితో సహా ఆ ఆశ్రమం దాటి పంపా సరస్సుకు వెళ్ళాడు. దానికి సమీపంలోనే మతంగ సరస్సున్నది. రాముడు అందులో స్నానం చేసి లక్ష్మణుడితో, "లక్ష్మణా, ఈ సమీపంలోనే ఋశ్యమూకపర్వతం పైన సుగ్రీవుడుంటాడు. నీవు బయలుదేరి అతని వద్దకు వెళ్ళు," అన్నాడు.

[అరణ్యకాండ సమాప్తం]



ప్రపంచపు వింతలు :

# 16. గ్రేట్ స్ఫింక్స్

ఇది ప్రపంచంలో కెల్లా పెద్దదైన రాతి శిల్పం. ఈనాడు మనం చూసే శిల్పా లన్నిటిలోకీ అత్యంత పురాతనమైనదనీ, దీని వయసు సుమారు 5,000 సంవత్సరా లుంటుందనీ అంచనా వేస్తున్నారు. 189 అడుగుల ఎత్తు గల ఈ శిల్పం దాదాపు ఏకాండపు రాతిలో మలిచినది. దీని ముందు కాళ్ళు మాత్రమే విడి రాళ్ళతో నిర్మించారు. దీని శరీరం సింహాన్ని సూచిస్తుంది. తల మనిషి తల. బహుశా ఈజిప్టుదేశపు ఫరావో (రాజు) ది అయి ఉంటుంది. ఈ సింహం శరీరం నిడివి 240 అడుగులు, దేహం ఎత్తు 66 అడుగులు. దీని పాదాలు ఇసుకలో పూడిపోయాయి. ఎడారి గాడ్పులకు ఈ చెక్కడం మెడవరకూ ఇసుకలో పూడిపోవటం జరిగేదిట ఈజిప్టును ముస్లిములు ఆక్రమించినప్పుడు, ఇదేదో దేవతా విగ్రహ మనుకుని దీని ముఖాన్ని ధ్వంసం చేయ యత్నించారు. ఈజిప్టు ప్రభుత్వం ఈ అపూర్వ చెక్కడం పట్ల శ్రద్ధ వహించి దీని చుట్టూ పేరిన ఇసుక తవ్వి తీసి విగ్రహానికి మరమ్మతులు చేయించింది. ఈనాటి ప్రపంచాద్భుతాలలో ఇది ఒకటి.






1. బి. దామోదర్, ముస్త్యాల

భూమి తిరుగు చున్నదని చెప్పడానికి అధారా లేవి? సూర్యుడే తూర్పున ఉదయించి పడమర అస్తమించుతున్నాడో ఏమో?

తమ్ముడూ, ఒక్క సూర్యుడే తిరుగుతుంటే నీ వన్నట్టు భూమి తిరగటం లేదేమో ననుకోవచ్చు. కాని భూమి చుట్టూ ఉన్న ప్రతి నక్షత్రమూ, ప్రతి గ్రహమూ, కంటికి కనిపించే కోటానుకోట్ల నక్షత్రాలతో సహా ఆకాశమే తూర్పు నుంచి పడమరకు పోతుంటే మన భూమి స్థిరంగా ఉండి అవన్నీ తిరుగుతూన్నాయనుకోవటం సబబేనా? భూమికి తొమ్మిది కోట్ల మైళ్ళకు మించిన దూరంలో ఉన్న సూర్యుణ్ణి భూమి ఏ శక్తితో రోజు కొకసారి తిప్పకోగలదు? ఆ సూర్యుడు ఏ వేగంతో తిరగాలి? ఇవన్నీ ఆలోచిస్తే భూమి బొంగరంలా తన చుట్టూ తాను తిరుగుతున్నదనుకోవటమే సబబని తేలిపోతుంది.

2. పి. రాజారావు, కొమరాడ

మండే ప్రతి వస్తువులోనూ కాంతి వుంటుందా? వుంటే వేడిమి వెల్తురౌతుంది. దానికి సాక్ష్యం సూర్యుడే. మరి చుక్కల నుంచీ, దీపముల నుంచీ మనం పొందేది ఉత్త వెల్తురే. కారణం? వేడిమి వెలుతురుకాదా?

ఈ ప్రశ్న చాలా గందరగోళంగా ఉన్నది. ఉష్ణమూ, వెలుతురూ కూడా శక్తి యొక్క భిన్న రూపాలు. ఇనుమును కాల్చినప్పుడు ముందు వేడెక్కి తరవాత ప్రకాశించటం ప్రారంభిస్తుంది. ఎర్రగా కాలక ముందు దానిలో వేడి లేదనగలమా? వెలుతురివ్వని వేడిమి ఉంటుంది. అలాగే వేడిమి ఏమాత్రమూ లేని వెలుతురు కూడా మనం మిణుగురు పురుగులలో చూస్తున్నాం. రిస్టువాచీలలో ఉండే "రేడియం" అంకెలు చీకట్లో ప్రకాశించి వెలుతురిస్తాయి, కాని అవి వేడి నివ్వవు. అయితే నక్షత్రాల నుంచి మనకు వేడిమి రావటం లేదనీ, వెలుగు మాత్రమే వస్తున్నదనీ అనుకోవటం పొరపాటు. మన కన్ను శక్తివంతమైనది గనక నక్షత్రాల

కాంతిని మనం చూస్తున్నాం, చర్మం సున్నితమైనది కానందున నక్షత్రాల వేడి మనకు తెలియటంలేదు. కాని అంత మాత్రాన వాటి కాంతి వెంట వేడి లేదనుకోరాదు. నక్షత్రాల వేడిని కొలవటానికి అతి నాజూకైన పరికరా లున్నాయి. నక్షత్రాలు కూడా సూర్యుళ్ళే. ఆ నక్షత్రాల ప్రాంతం నుంచి చూస్తే మన సూర్యుడు మిణుకు మిణుకు మంటూ ఉంటుందేగాని, దీని వేడి అంత దూరానికి తెలియరాదు.

3. మాణిక్యాల రఘురామరెడ్డి, రామగుండం

అన్నయ్యా, సూర్యుడు ఉదయం, సాయంత్రం భూమికి దూరంగా ఉంటాడని, మధ్యాహ్నం భూమికి కొంత దగ్గరగా ఉంటాడనీ, అందుకే ఉదయ సంధ్యలప్పటి కంటే మధ్యాహ్నమే ఎక్కువ వేడి, వెలుతురు కలుగుతోందని అంటారు. మరి సూర్యుడు ఉదయం, సాయంత్రం పెద్దగా కనిపించి మధ్యాహ్నం పూట చిన్నగా కనిపిస్తాడెందుకు?

తమ్ముడూ, నీ ప్రశ్న నిండా అనేక అపోహలున్నాయి. వాటిని వరసగా వివరిస్తాను: (1) కొద్ది గంటల సేపట్లో మనకూ సూర్యుడికీ ఉండే దూరంలో మార్పురాదు (2) సూర్య కిరణాలు ఏటవాలుగా పడటంచేత ఉదయానా, సాయంకాలానా సూర్యుడి కాంతీ, వేడీ తగ్గి ఉంటుంది గాని, దూరంతో దానికేమీ సంబంధం లేదు. (3) భూమి చుట్టూ ఒకటి రెండు వేల మైళ్ళ మందాన గాలి పొర ఉన్నది. సూర్యకాంతి ఉదయాస్తమయా లప్పుడు ఈ పొరలో ఎక్కువ దూరం ప్రయాణించటంవల్లకూడా కాంతీ వేడీ తగ్గటం జరుగుతుంది. సూర్యబింబం పెద్దదిగా కనపడటానికి కూడా గాలి పొరే కారణం. (4) మధ్యాహ్నం పూట సూర్య కిరణాలు మనపైన సూటిగా పడతాయి; అందుచేత అవి తీక్షణంగా ఉంటాయి. మధ్యాహ్నం పూట మనకూ సూర్యుడికీ మధ్య ఉండే గాలి పొరకూడా తక్కువ మందంగా ఉంటుంది. అందుచేత బింబం చిన్నదిగా ఉంటుంది.

4. జె. సూర్యనారాయణరావు, గద్వాల

మనదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యము 15 ఆగష్టునాడు దొరికితే జనవరి 26 నాడు రిపబ్లిక్ దిన మంటారు, కారణం?

1947 ఆగస్టు 15 న మన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. అంటే అధికారం భారతీయుల హస్త గతమయింది. ఇది జరిగిన అనంతరమే భారతదేశం స్వతంత్ర రిపబ్లిక్‌గా ఉండాలన్న నిశ్చయం జరిగింది. అందుకు అనుకూలమైన రాజ్యాంగం 1949 జనవరి 26 న అమలులోకి రావటంచేత అది రిపబ్లిక్ దినమయింది.

Photo by Brahm Dev



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఎండ తగలదు

పంపినవారు :
పి. మహాలక్ష్మి, ఆమదాలవలస

Photo by N. Ramakrishna



బహుమతి
పొందిన వ్యాఖ్య

బండి కదలదు

పంపినవారు:
పి. మహాలక్ష్మి, ఆముదాలవలస

# సహవాసదోషం ★ [రామతీర్థ కథ]

ఒకచోట ఒక కుక్కా, పిల్లీ ఉండేవి. అవి స్నేహంగానే ఉన్నప్పటికీ, వాటి బుద్ధులు వేరు వేరుగా ఉండటంచేత, ఒకదాని తత్వాన్ని ఒకటి అస్తమానమూ గమనించి ఆశ్చర్యం పొందుతూ ఉండేవి.

ఒకసారి కుక్క ఒక జ్ఞాని వద్దకు వెళ్ళి, "స్వామీ, ఈ పిల్లి చాలా చెడ్డది. దీని వన్నీ దొంగబుద్ధులు. ఇది వచ్చే జన్మలో ఏమై పుడుతుంది?" అని అడిగింది.

అలాగే పిల్లికూడా జ్ఞానిని, "స్వామీ, ఈ కుక్కకు తగని కోపం. దేన్ని చూసినా గుర్రు మంటుంది, మొరుగు తుంది. వచ్చే జన్మలో ఇది ఏమై పుడుతుంది?" అని అడిగింది.

జ్ఞాని ఈ ప్రశ్నలకు మొదట్లో సమాధానం చెప్పలేదు. కాని కుక్కా, పిల్లీ ప్రతిరోజూ ఇవే ప్రశ్నలు అడగసాగాయి. అందుచేత ఆయన వాటితో, "మీరీ ప్రశ్నలు అడగకుండా వుంటే బాగుండేది. అయినా తెలుసుకోగోరుతున్నారు గనక చెబుతున్నాను. ఈ కుక్క అస్తమానమూ పిల్లి లక్షణాలను గురించే ధ్యానం చేస్తూ ఉండటంచేత పై జన్మలో అది పిల్లిగా పుడుతుంది. అలాగే పిల్లి కుక్కగా పుడుతుంది," అని చెప్పాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1963 మే నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎండ తగలదు

రెండవ ఫోటో : బండి కదలదు

పంపినవారు : పెనుమళ్ల మహాలక్ష్మి,

అమదాలవలస.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# భారతం

ఈ లోపల ద్వారకలో కృష్ణుడు అశ్వమేధ యాగానికి బయలుదేరే సమయం వచ్చిందని నిశ్చయించి, యాదవులతో సహా హస్తినాపురానికి బయలుదేరాడు. అతని వెంట ప్రద్యుమ్నుడూ, సాత్యకీ, సుభద్రా, బలరాముడూ, సాంబుడూ, కృతవర్మా మొదలైనవారంతా బయలుదేరారు. వారు హస్తినాపురం చేరే సమయానికి, పాండవుల తరపున ధృతరాష్ట్రుడు విదురుడితో సహా ఎదురువెళ్ళి నగరానికి తీసుకొచ్చాడు.

వీరంతా వచ్చి ఉన్న సమయంలోనే ఉత్తరకు ప్రసవం వచ్చింది. పాండవ వంశానికి అంకురం కలగనున్నదని ఆనందంతో ప్రజలు చేసిన సింహనాదాలు అంతలోనే నిలిచిపోయాయి—ఉత్తరకు పుట్టినది మృతశిశువు!

ఈ వార్త వింటూనే కృష్ణుడు సాత్యకితో సహా త్వరగా అంతఃపురానికి వచ్చాడు. కుంతి ఆత్రంగా ఎదురు వచ్చి, "కృష్ణా, త్వరగా రావాలి," అన్నది. ఆమె వెనకగా సుభద్రా, ద్రౌపదీ, ఇతర స్త్రీలూ ఏడుస్తూ వచ్చారు. "నాయనా, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రంతో నీ మేనల్లుడి కొడుకు చచ్చి పుట్టాడు. వాణ్ణి ఎలా బతికిస్తావో!" అన్నది. సుభద్ర కూడా తన మనవణ్ణి బతికించమని అన్నను వేడుకున్నది. అలాగే బతికిస్తానని స్త్రీజనానికి ధైర్యం చెప్పి కృష్ణుడు పురిటింట ప్రవేశించాడు పురిటిల్లు జనంతో కిటకిటలాడుతున్నది. అక్కడ వైద్యులు కూడా, ఉన్నారు. ఉత్తర కృష్ణుడి కాళ్ళమీద పడి తన కొడుకును బతికించమని ఏడ్చింది. ఆమె దుఃఖం చూడలేక మిగిలిన స్త్రీలు కూడా ఏడ్చారు.

అప్పుడు కృష్ణుడు, "నేనే అబద్ధమాడనివాడనైతే, ధర్మమంటే అభిమానం కలవాడనైతే ఈ అభిమన్యు సుతుడు బ్రతుకు గాక!" అంటూ ఆ మృత శిశువును తన పాదంతో తాకి ఆ పాదమస్తకం రాచాడు. వెంటనే ఆ శిశువులోకి ప్రాణమూ, చలనమూ వచ్చాయి. బ్రహ్మాస్త్ర ప్రభావం విరిగిపోయింది.

అక్కడి జనం పొందిన ఆనందానికి మేరలేదు. ముఖ్యంగా కుంతి, సుభద్రా, ద్రౌపదీ, ఉత్తరా పట్టలేని సంతోషం పొందారు. అందరూ కృష్ణుణ్ణి కీర్తించారు.

"వంశం పరిక్షీణం అయే దశలో పుట్టాడు గనక వీడికి పరీక్షిత్తు అని పేరు పెడుతున్నాను," అన్నాడు కృష్ణుడు. ఆ విధంగా చచ్చి బతికిన పరీక్షిత్తు దినదిన ప్రవర్ధమానుడవుతూ పెరగసాగాడు. ఒక నెల గడిచింది.

అప్పుడు పాండవులు ధనంతో సహా తిరిగి వచ్చారు. యాదవులు వారి కెదురువెళ్ళి తీసుకొచ్చారు. హస్తినాపురమంతా పుష్పమాలలతో అలంకరించారు. ధ్వజా లెత్తారు. పతాకలెగిరాయి. పౌరులంతా తమ ఇళ్ళకు అలంకారాలు చేసుకున్నారు. పూజలు జరిగాయి. నర్తకులు నాట్యాలు చేశారు. గాయకులు పాడారు. హస్తినాపురం రెండో అలకా నగరంలా తయారయింది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

★

# చందమామ

"చందమామ" ధరలో మార్పు జరుగుతున్నది. ఏప్రిలు 1963 నుంచి కాపీ వెల 60 న. పైసలు.

ఏప్రిలు నుంచి ప్రారంభమయే సాలు చందాలూ, పొడిగించబడే పాత చందాలూ రు. 7-20 లు అవుతవి. అమలులో ఉండే చందాలకు ఈ మార్పు వర్తించదు. కాని వాటిని పొడిగించేటప్పుడు కొత్త రేటు అమలు జరుగుతుంది.

మా పాఠక మిత్రులు సహకరించగలరని ఆశిస్తున్నాము.

—ప్రకాశకులు

★

ఎల్లప్పుడూ టినోపాల్
ఉపయోగించి
దుప్పట్లను
తలగడా గలేబులను
టేబుల్ గుడ్డలను
కళ్లు మిరుమిట్లు
గొలిపేలా తెల్లగా మరింత
తెల్లగా ఉంచుకోండి




క్రమం తప్పకుండా టినోపాల్ ఉపయోగించి మీ దుప్పట్లను, తలగడా గలేబులను, టేబుల్ గుడ్డలను, తువ్వాళ్లను మెరిసేలా తెల్లగా ఉంచుకోండి — ఎల్లప్పుడూ! మీరు టినోపాల్ వాడుతే మీ యింట్లో వాడుకునే దుప్పట్లు మొగలె నవి, వెలిసిపోయి మాసిపోయినట్లు ఉండవు. టినోపాల్‌ను క్రమంగా వాడితే మాత్రమే మీ తెల్లని బట్టలు నిజంగా తెల్లగా ఉంటాయి. కనుక మీరు తెల్లని బట్టలను ఉతికిన తరువాత వాటిని టినోపాల్ కలిపిన నీళ్లలో ఝాడించండి—ఎల్లప్పుడూ!




టినోపాల్ జె. ఆర్. గెయిగి, ఎస్. ఎ. బాల్, స్విట్జర్లెండ్ వారి రిజిష్టరు చేయబడిన ట్రేడు మార్క్.

ఉత్పత్తిదారులు:
సుహృద్ గైగి లిమిటెడ్ వడి వాడి, బరోడా

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గైగి ట్రేడింగ్ లిమిటెడ్ పోస్ట బాక్స్ 965, బొంబాయి-1 బి.ఆర్.

SISTA'S SG 174A

TEL

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form IV), Newspapers (Central) Rules, 1956.**

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras-26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each Calendar month |
| 3. *Printer's Name* | : | B. NAGI REDDI,<br>Managing Director,<br>The B. N. K. Press (Pvt.) Ltd. |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 4. *Publisher's Name* | : | B. VENUGOPAL REDDI, Managing Partner, Sarada Binding Works |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 5. *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 6. *Name & Address of individuals who own the paper* | : | SARADA BINDING WORKS:<br>PARTNERS,<br>1. Sri. B. Venugopal Reddi.<br>2. Smt. B. Seshamma.<br>3. Smt. B. Rajani Saraswathi.<br>4. Smt. A. Jayalakshmi.<br>5. Sri. B. L. N. Prasad.<br>6. Sri. B. Viswanatha Reddi.<br>★ 7. Kumari. B. Sarada.<br>★ 8. Sri. B. Venkatrama Reddi.<br>★ MINORS |

I, B. Venugopal Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March, 1963*

**B. VENUGOPAL REDDI,**
*Signature of the Publisher*

